54
ఆగస్ట్, 1994
ISSN 0971-278X

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక

## బెర్టోల్ట్ బ్రెహ్ట్ వర్ధంతి



జనసాహితి

# నెత్తురు పారని యుద్ధం

— యం. కృష్ణారావు

దాడి ఎట్లా జరుగుతుందో తెలియని
ఒక అసందిగ్ధ సన్నివేశం.
యుద్ధ భేరీల శబ్ద మేఘాలు
మనల్ని కమ్ముకోవు.
రక్తంలో మునిగి మునిగి
నాని ఉబ్బిన పాదాల పద ఘట్టనలు విన్పించవు.
సమ్మతించిన సంతకాలతో దాడ మొదలవుతుంది.
ఇప్పుడు యుద్ధమంతా ఏకపక్షమే!
కరవాల ధ్వనులుండవు
క్షిపణి వర్షం కురియదు.
రంకె వేస్తున్న ఎనుబోతు కాళ్ళకింద
లేగ దూడల ఆక్రందనలు విన్పించవు
ఇది నెత్తురు పారని యుద్ధం
యుద్ధం దురాక్రమమై ముగుస్తుంది.
మానభంగమై చితికిపోయిన దేశం
కన్పించని గాయాల నొప్పులతో రోదిస్తుంది.
భూమి కడుపులో దాచుకున్న
పేటెంట్ విత్తనం
పుండై మొలకెత్తుతుంది.
మందు కోసం చాచిన చేతులన్నీ
వెన్నుతిరిగి నెర్రెలుపడ్డ భూమిలో క్రుంగిపోతాయి.
ఇక్కడ విజేత జండా లెగరవు
చిరిగిన స్వతంత్ర జండా కిందనే
దేశం చేతిలో ఆకలి డొక్కలు 'అమ్మా!' అంటాయి.
సంస్కారం లేక శవాలన్నీ కుళ్ళి కుళ్ళి
దేశం కనుగుడ్లపై పసులవుతాయి.
దేశం నరాలగుండా
యుద్ధ బీభత్సం సైనేడయి ప్రవహిస్తుంది.
స్వేచ్ఛా ప్రతిమ చేతిలో
గెలుపు గర్వంగా జ్వలిస్తుంది.
ఓ పసివాడు
ఎరాజెర్‌తో సంతకాలు చెరపటం ప్రాక్టీస్ చేస్తున్నాడు.
మందుల మూలికల కోసం

(తరువా

PSL02A135



సంపుటి : 18 సంచిక : 1

154 అగస్టు 1994

రచనలు పంపవలసిన చిరునామా :

నిర్మలానంద,
వర్కింగ్ ఎడిటర్, ప్రజాసాహితి,
7-1-23, తమిళ్ స్ట్రీట్,
చినవాల్తేరు,
విశాఖపట్నం - 530 023.

ప్రజాసాహితి కార్యాలయం,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

ఏజంట్లు, చందారులు
వ్రాయవలసిన అడ్రస్

ఇతర వివరాలకు :

కొత్తపల్లి రవిబాబు,
ప్రధాన కార్యదర్శి,
జనసాహితి, నగరం-522 268
గుంటూరుజిల్లా



రెండవ కవరు పేజీ :

నెత్తురు పారని యుద్ధం
(కవిత)
— యం. కృష్ణారావు

మూడవ కవరు పేజీ :

నిర్బంధమే విప్లవానికి నాంది
(కవిత)
— పి. శారద

నాల్గవ కవరు పేజీ :

ఒరేయ్ మనూ ! [గుజరాతీ కవిత]
— జయంత్ పార్మార్
అను : కొత్తపల్లి రవిబాబు

ఈ సంచిక వెల : రు. 5-00

వెల : రూ. 5 సం॥ చందా రూ. 50

ప్రత్యేక సం॥ చందా రు. 100

చందాలు చెక్కులు రూపంలో పంపేటప్పుడు అదనంగా రూ. 5/- కలిపి పంపించండి కలెక్షను కోసం

ఈ సంచికలో...




Edited, Printed and Published by K. RAVI BABU on beh
JANA SAHITI (A.P.), at Chaitanya Printers, Vijayaw
for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA



# ఆగస్టు 6 నుండి డిసెంబరు 6 దాకా ...

3 సం॥ల క్రితం ఆగస్టు 6న గుంటూరు జిల్లా చుండూరులో అగ్రకుల దురహంకారులు దళితులపై దాడిచేసి, పరమ కిరాతకంగా చంపి, కొందరిని బతి కుండగానే గోతాలలో కుక్కి, తుంగభద్ర మురుగు కాలవలో పోలీసుల సాక్షిగా విసిరేశారు. సభ్య సమాజం సిగ్గుతో తల దించుకుంది. పై సంఘటనలలో ముఖ్య సాక్షిగా వున్న అనిల్‌కుమార్‌ను పట్టపగలు అందరూ చూస్తుండగానే, పోలీసు అధికారులే కాల్చి చంపారు. దానితో కుల పీడనకు వ్యతిరేకంగా సాగుతున్న దళిత ఉద్యమం కొత్త ఊపు అందుకున్నది. ప్రముఖ చర్చనీయాంశంగా మన ముందు నిలిచి వుంది.

1992 డిసెంబరు 6న హిందూ మతోన్మాదులు లక్షలాది మందిని అయోధ్యకు తరలించి, సుమారు 500 సం॥ల నాటి చారిత్రక కట్టడం- బాబ్రీ మసీదుని ధ్వంసం చేసి, నేల మట్టం గావించారు. భారత ప్రభుత్వం తనకేమీ పట్టనట్టు మౌన సాక్షిగా నిలిచిపోయింది. అప్పటికి దశాబ్ది కాలంగా పేట్రేగిన హిందూ మతోన్మాదం ఎన్నో మత కలహాలు సృష్టించి, వేలాది మంది మైనారిటీ మతస్తులను ఊచకోత కోస్తూ వస్తున్నది. భారత పాలకులు హిందూ మతోన్మాదానికి పాలు పోసి, పెంచుకుంటూనే వచ్చారు. ఒక వైపున దోపిడీ వ్యవస్థ మైనారిటీలను రెండవ శ్రేణి పౌరులుగా దిగజారిస్తే, హిందూ మతోన్మాదులు వారికి 'అభద్రతా' వాతావరణాన్ని కల్పిస్తున్నారు. సెక్యులరిజాన్ని బూతు పదంగా దిగజార్చి, మెజారిటీ తత్వమే ప్రజాస్వామ్యంగా వ్యాఖ్యానిస్తున్నారు.

మండల్ కమీషన్ నివేదికను, దళితులకు అది అందించిన కొద్దిపాటి అవ కాశాలను కూడా హిందూ మతోన్మాదం వ్యతిరేకించింది. హిందూ అగ్రకుల దురంహకారాన్ని, దళిత ప్రజల పట్ల జుగుప్సాకరమైన వ్యతిరేకతను రెచ్చగొట్టింది ఆ విధంగా దళితుల మైనారిటీల ఉనికికే హిందూ మతోన్మాదం, అగ్రకుల తత్వాలు ప్రమాదకరంగా తయారయ్యాయి.

జబ్బు లక్షణాలకు మందు వేసి, కారణాలను నిర్మూలించపోతే అది తిరిగబెట్టి పీడిస్తుంది. అలాగే సమాజం యొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల యొక్క అన్ని పార్శ్వాలలో పోరాటం సాగిస్తూనే వీటికి మూలాధారంగా వున్న దోపిడీ ఆర్థిక వ్యవస్థను సమూలంగా తుడిచిపెట్టక పోతే మళ్ళీ మళ్ళీ కొత్త రూపాల్లో పాత సమస్యలే తలెత్తుతూ వుంటాయి.

కుల వ్యవస్థ అన్నది భారత ఫ్యూడల్ (వర్గ) సమాజం యొక్క ప్రత్యేక లక్షణం. దోపిడీ వర్గాల వంశాలూ, కులాలూ, మతాలూ మారినా దోపిడీ వ్యవస్థతో పాటు కుల వ్యవస్థ కూడా క్షేమంగా కొనసాగుతూ వస్తోంది. అది పాలక వర్గాల దోపిడీ, అణచివేతా, పీడనల సాధనంగానే కాక ప్రజలను (శ్రామికులను) చీల్చి వుంచటానికీ, ఐక్యం కానివ్వకుండా చూడటానికి కూడా ఉపయోగపడుతోంది. ఫ్యూడల్ వ్యవస్థ బలహీన పడ్డ మేరకు దాని అణచివేత తీవ్రతలో సడలింపు వచ్చిందనేది ఎవరూ కాదనలేని వాస్తవం. ప్రస్తుత అర్థ ఫ్యూడల్ అర్థ-వలస వ్యవస్థలో చారిత్రకంగా కాలం చెల్లిపోయిన ఫ్యూడల్ వ్యవస్థకు సామ్రాజ్యవాదం అలంబనగా (PROP) నిలిచి కాపాడుతోంది. ప్రజల్ని విభజించి పాలించటంలోనూ సాంస్కృతిక సాధనాల ద్వారా అణచి వుంచటంలోనూ, పాతకాలపు మొరటు ఫ్యూడల్ దొరల కంటే అత్యాధునిక సామ్రాజ్యవాదం చాలా నాజూకైనదీ తెలివి తేటలు గలదీను!

భారతదేశంలో మత తత్వానికీ, వైషమ్యాలను పెంచటానికీ నిప్పులు రాజేసింది బ్రిటీషు సామ్రాజ్య వాదమే. వాళ్ళు ఏర్పాటు చేసిన ప్రత్యేక నియోజక వర్గాలూ [Separate electorates], మత ప్రాతిపదిక [కమ్యూనల్] రిజర్వేషన్లూ సూత్రాలను భాగంగా చేసిన 1909 మింటో- మార్లీ సంస్కరణలు, 1919 నాటి మాంటిగు -ఛెమ్స్‌ఫర్డుసంస్కరణలు, 1935 నాటి భారత ప్రభుత్వ చట్టం వంటి రాజ్యాంగ చర్యలు మత సమస్యను శాశ్వత మొనర్చాయి. మత తత్వం అన్నది పాలక వర్గాల చేతిలో తమకు అవసమైనప్పుడల్లా ఉపయోగించుకునే ఆయుధంగా చేసుకున్నారు.

బ్రిటీషు సామ్రాజ్యవాదుల వారసులుగా గద్దె నెక్కి గత 47 సం॥లు గా పరిపాలిస్తున్న దళారీ భారత దోపిడీ పాలకులు మత తత్వం, కుల తత్వం, ప్రాంతీయ తత్వాలనన్నిటినీ ప్రజల్ని చీల్చటానికీ, పక్కదారి పట్టించటానికీ వినియోగించుకుంటున్నారు. నిచ్చెన మెట్ల కుల వ్యవస్థను పెంచి పోషిస్తున్నారు. అంటరానితనం, కుల వివక్షత, అణచివేతా, దౌర్జన్యాలూ, దాడులూ, హత్యాకాండా తరతమస్థాయిల్లో

దేశమంతటావిస్తారంగాఅమలుజరుగుతున్నాయి,కొనసాగుతున్నాయి ఫ్యూడల్ శక్తులు, పాలకవర్గాలు అగ్రకుల దురహంకారాన్ని పెంచిపోషించి, కులపీడనా, అణచివేతలకు దాడులకూ, హత్యాకాండలకు ప్రేరకాలుగా ఉంటున్నారు. వీరి దోపిడీ, అణచివేత లకు పనిముట్టుగా వున్న 'రాజ్యాంగ యంత్రం' (రాజ్యం)దళిత వ్యతిరేక దురహం కారంతో నిరంకుశంగా వ్యవహరిస్తోంది. అధికారమూ, సంపదా కలిగిన వర్గాలు అగ్రకుల దురహంకారంతో విర్రవీగడం, పొగరుని ప్రదర్శించుకోవటం సామాజిక వ్యవస్థ స్వాభావిక లక్షణంగా వుంది.

పుట్టుక కారణంగా హెచ్చు తగ్గులను, ఉచ్చనీచాలను బోధించి, పాటించే పితృస్వామ్య, కుల పీడనా వ్యవస్థలో ఒక మహిళగా జన్మించి నందుకు ఇందిరా గాంధీ, దళితునిగా పుట్టినందుకు జగజ్జీవన్‌రామ్‌లు కూడా వివక్షతలకు గురయిన దేశం మనది. వ్యవసాయకూలీలుగా, పేద మధ్యతరగతి రైతులుగా, ఉద్యోగులుగా, చేతివృత్తుల పారిశ్రామిక కార్మికులుగా శ్రమించే దళితుల, మైనారిటీలపైసాగే దోపిడీ పీడనల తీవ్రతను మనం ఊహించుకోవచ్చు. భూస్వామ్య-సామ్రాజ్యవాద దోపిడీ, పీడనల నుండి విముక్తి కావాల్సిన తక్షణావసరం ఈ వర్గాలకే వుంది. వీరిపై సాగే సాంఘికపీడనలకువ్యతిరేకంగా,సాంస్కృతికంగా,భౌతికంగాసాగించేపోరాటం యొక్క క్రమంలో మొత్తంగా దోపిడీ వ్యవస్థను అంతంచేసే జనతాప్రజాతంత్ర విప్లవ పోరాట విజయంతో తప్ప, నిజమైన విముక్తి సాధ్యం కాదనే చైతన్యాన్ని వీరికి కలిగిం చాలి. తమ తమ వర్గ సంఘాలలో సంఘటితమై సమస్త తెగల, జాతుల, కులాల, మతాలలోవున్న వర్గ మిత్రులతో భుజం భుజం కలిపి పోరాడేట్టు చూడాలి. ఇప్పటికే ఆ క్రమంలో వున్న వారికి మద్దతు నందించాలి. పోరాడే ప్రజలపై అమలు జరుగు తున్న క్రూరమైన రాజ్య హింసను ఖండించాలి.

వర్గ పోరాటమంటే ఆర్థిక పోరాటమేనననీ, వర్గపోరాట సిద్ధాంతమంటే ఆర్థిక నియతి వాదమేనని [Economic determinism] పూర్వం రాయిస్టులూ, లోహియా తరహా సోషలిస్టులూ భావించేవారు. ప్రస్తుతం కొందరు తెలియక అమా కంగా అలాంటి అభిప్రాయాలకు గురి కావటమూ, ఇంకొందరు కావాలని అలా ప్రచారం చేయటమూ జరుగుతోంది. కూలీ పెంపుదలకు సాగించే పోరాటాలూ, సమ్మెలూ....ఇటువంటివి మాత్రమే వర్గ పోరాటాలని భావించే వారున్నారు. నిజానికి భావజాల రంగంలో, సాహితీ-సాంస్కృతిక రంగాలలో సాగించే ప్రచారాందోళనా కృషి అంతా కూడా వర్గ పోరాటంలో అంతర్భాగమే. అటువంటిది భూస్వామ్య,

అగ్రకులహంకారులు అమలు జరిపే సాంఘిక వివక్షతలకు, కుల పీడనకూ, అణచివేతకూ, దాడులకు, అత్యాచారాలకు వ్యతిరేకంగా దళితులు సాగించే పోరాటం వర్గ పోరాటం. కాకుండా కుల పోరాటం ఎలా అవుతుంది? లౌకిక, ప్రజాస్వామ్య జీవనానికై - సాగించే అన్ని పోరాటాలూ వర్గ పోరాటాలే. నూతన ప్రజాస్వామిక విప్లవంలో అంతర్భాగాలే. ఒక్కమాటలో సామాజిక సమానత్వం వైపు సాగే పోరాటాలన్నీ వర్గపోరాటాలే అవుతాయి.

దోపిడీ పీడనలలో వాటాకోసం, కులాధిపత్యం కోసం జరిపే పోరాటం మాత్రం కుల పోరాటమవుతుంది లేక దోపిడీ ముఠాల మధ్య పోరాట మవుతుంది. ఇది దోపిడీ వ్యవస్థను చెక్కు చెదర నివ్వకుండా కాపాడుతుంది ఈ కుల పోరాట వాదులు పాలక వర్గ పార్టీలకు అనుయాయులుగా తయారవుతారు.

కుల వ్యవస్థకు, వివక్షతలకువ్యతిరేకంగాసాంఘికసమానత్వంకోసంసాగుతున్న పోరాటానికి మనదేశంలో సుదీర్ఘ చరిత్రవుంది. ప్రాచీన కాలంలో చార్వాకులూ, మధ్యయుగాలలో వివిధ రకాల భక్తి, సూఫీ ఉద్యమాలూ, ఆధునిక కాలంలో జ్యోతి బా పూలే, డా॥ బి. ఆర్. అంబేద్కర్, రామస్వామి నాయకర్, నారాయణ గురులూ, రాజా రామ్మోహన్‌రాయ్, కందుకూరి, గురజాడ, త్రిపురనేని రామస్వామి, గుర్రం జాషువా తదితరు లెందరో ఉన్నారు. వీరి కృషి నుండి లౌకిక విలువలకి వినియోగపడే అంశాలనన్నింటినీ గ్రహించి మరింత సంపద్వంతం చేసుకోవటం ప్రజాస్వామిక వాదుల కర్తవ్యం.

భూస్వాములకూ, అగ్రకుల దురహంకారులకూ, హిందూ మతోన్మాదులకూ వ్యతిరేకంగా పీడిత ప్రజలూ, దళితులూ, మైనారిటీలూ సాగించే ప్రజాస్వామిక కార్యాచరణకు 'ప్రజాసాహితి' ఆహ్వానం పలుకుతోంది. కుల వ్యవస్థకున్న భౌతిక దోపిడీ పునాదిని పెకలించివేయటానికీ, కార్మిక-కర్షక ఐక్యత పునాదిగా ఏర్పడే జనతా ప్రజాస్వామిక రాజ్యస్థాపనకూ, దళిత, ప్రజాస్వామిక శక్తులు కుల వ్యవస్థకు వ్యతిరేకంగా సాగించే పోరాటాలు దోహద పడగలవని ప్రగాఢంగా విశ్వసిస్తోంది.

దోపిడీ, పీడనల వ్యవస్థను కాపాడుకోవటానికి పాలక వర్గాలు వ్యాప్తి చేస్తున్న హిందూ మత ఛాందసత్వానికీ, బ్రాహ్మణీయ అగ్రకుల ఉన్మాదానికీ వాటికి పునాదులుగా వున్న భూస్వామ్య సామ్రాజ్యవాద సంస్కృతులకు వ్యతిరేకంగా పోరాడటానికి 'ప్రజాసాహితి' పునరంకితమవుతోంది. దళిత, మైనారిటీలు సాగించే ఆత్మరక్షణ పోరాటాలకు తన వంతు సాంస్కృతిక మద్దతు నందిస్తుంది.

# జనరల్ నీ శతఘ్ని మహా శక్తివంతం

అది అరణ్యాల్ని అడ్డంగా నరికెయ్య గలదు
అవలీలగా వంద మందిని పిప్పిచేసెయ్య గలదు
కానీ దానికున్న దొక్కటే లోపం
దానికో 'డ్రైవర్' అవసరం.
జనరల్
నీ బాంబర్
మహా శక్తివంత మారణాయుధం
అది ప్రచండ తుఫానుకన్నా వేగంగా
ప్రయాణించ గలదు
మద గజం కన్నా మిన్నగా బరువుని
మోసెయ్య గలదు
కానీ దీనికున్నదొక్కటే లోపం
దానికో మెకానిక్ అవపరం.
జనరల్
మనిషి చాలా పనికొస్తాడు
అతను ఎగర గలడు
అతను చంప గలడు
కానీ అతనికున్నదొక్కటే లోపం
అతను ఆలోచించగలడు.

అనువాదం : నగ్నముని

# నాకు "సమాధిరాయి" అక్కర్లేదు

అక్కర్లేదు—
శవం మీద పాతి పెట్ట బడిన
'సమాధి రాయి'
నా కక్కర్లేనే లేదు.
నాకూ ఒకటి అవసరమని
నువ్వంటావేమోకానీ,
ఆ అవసరం నాకు రానే రాదు!
నేను
ఈ పదాల నదుల్ని భరించటానికి
సిద్ధంగా ఉన్నా—
అతను
అనుభవాల తీగల్ని మీటుతూ
సందేశాల్ని గానం చేస్తున్నాడు,
'ఆశయ శిఖరం వైపు
మన ఆచరణ చరణాల సంతకాలతో సాగిపొమ్మనీ!
ఆ శాసన గీతం ముందు
మనం
మన హృదయాల్ని పుష్పాల్ని చేసి
గౌరవ పరిమళాల్ని పరువాల్సిన
అవసర ముంది తప్ప:
'సమాధి రాయి' అక్కర్లేదనే అంటా !

అనువాదం : నందిని సిధారెడ్డి

(బ్రెహ్ట్ కవితా సంకలనం 'రేపటి కోసం' నుంచి)

# సాహిత్యం - స్థల కాల బద్ధత

— పాపినేని శివశంకర్

విశ్వాంతరాళంలోని సమస్త వస్తు జాలాన్ని పదార్థం (matter) అంటాం.

స్థలం (Space), పక్క పక్కనే ఉనికి గలిగిన వస్తువుల వ్యాప్తిని తెలియజేస్తుంది.

కాలం (Time), వస్తు జాలం ఉనికిలోకి వచ్చే వరసను తెలియజేస్తుంది. ఈ వరుసలు ఒకదాని తర్వాత మరొకటి కొనసాగుతుంటాయి.

పదార్థం కాలంలో శాశ్వతమైంది; స్థలంలో అనంతమైంది. అంటే ఎన్ని కాలాలు గడిచినా పదార్థానికి వినాశం లేదు. అలాగే పదార్థ వ్యాప్తికి పరిమితి లేదు.

పదార్థం స్థల కాలాల్లోనే అస్తిత్వం కలిగి ఉంటుంది. స్థల కాలాల నుంచి పదార్థాన్ని విడదీసి చూడలేం. అదే విధంగా స్థలకాలాలు పదార్థంతోనే ఉండ గలుగుతాయి. అవి పదార్థం యొక్క అస్తిత్వ విధానాలు. పదార్థం లేకుండా స్థల కాలాలు ఉండవు. ఏ స్థలం? అనే ప్రశ్న వేసినప్పుడు పదార్థాన్ని బట్టే స్థలాన్ని నిర్ణయించ గలుగుతాం. ఏ కాలం? అన్నప్పుడు పదార్థ పరిణామంలోని గుర్తించ దగిన అంశాలను బట్టి మాత్రమే కాల నిర్ణయం చెయ్యగలం.

పదార్థ ముఖ్య లక్షణం చలనం (motion). స్థల కాలాల సారాంశమూ చలనమే. ప్రకృతిలోని ప్రతి వస్తువూ చలనంలో ఉంటుంది. పదార్థం, స్థలం, కాలం, చలనం- ఇవన్నీ అవిభాజ్యాలు. ఒక దానితో సంబంధం లేకుండా మరొకటి ఉండదు.

కాలం ఏక దిశాత్మకం. దాని గమనం ఎప్పుడూ గతం నుంచి భవిష్యత్తులోకే. గతంలోకి కాదు. కాబట్టి కాలంలో పదార్థ పరిణామం కేవలం ఒకే ఒక దిశలో గతం నుంచి భవిష్యత్తులోకి- సాగుతుంటుంది.

కాల విక్షేపం (elapse of time), పదార్థ రూపాల విస్తరణ, ఆ పదార్థ రూపాల కదలికల వేగంపై ఆధారపడి వుంటుంది. పదార్థ ద్రవ్యరాశిని బట్టి స్థల కాలాల స్వరూప స్వభావాలు మారతాయి.

ఇంతకూ సాహిత్యం గురించి మాట్లాడుకునేటప్పుడు ఈ భౌతిక శాస్త్ర విషయాలన్నీ ఎందుకు? ఎందుకంటే సాహిత్యం కూడా ఒక భౌతిక పదార్థమే గనుక. భౌతిక శాస్త్రానికి సంబంధించిన సాధారణ సూత్రాలు స్థూలంగా సాహిత్యానికి కూడా అన్వయిస్తాయి.

ఏ సాహిత్య రూపమైనా నిర్దిష్ట స్థల కాలాల్లో ఉనికిలోకి వస్తుంది. దానిని ఆ స్థల కాలాలతో సంబంధం లేకుండా విడిగా చూడటం సాధ్యం కాదు.

**చారిత్రక నియతి : (Historical determination) :**

చారిత్రక భౌతిక పరిస్థితులు సాహిత్య గతిని నిర్దేశిస్తాయి. ఆ పరిస్థితులు అనుమతించినంత మేరకు సాహిత్యం తన పాత్ర నిర్వహిస్తుంది. మరి సామాజిక చరిత్ర గతి ఎలా ఉంటుంది?

సామాజిక చరిత్రలో విభిన్న శక్తుల మధ్య నిరంతరం ఘర్షణ సాగుతుంటుంది. ఈ ఘర్షణ భౌతికంగానూ, బౌద్ధికంగానూ ఉంటుంది. ఈ ఘర్షణ విచ్ఛిత్తికీ, నూతన పరిణామానికీ దారి తీస్తుంది. అంతే గాక ఈ ఘర్షణ వ్యక్తుల మధ్య గాక శక్తుల మధ్య జరుగుతుందని గుర్తించాలి. చరిత్రలో వ్యక్తుల మధ్య జరిగినట్టు కన్పించే ఘర్షణలు కొన్ని శక్తుల మధ్య జరిగినవి.

1757లో ప్లాసీ యుద్ధం రాబర్ట్ క్లైవ్‌కూ, సిరాజుద్దౌలాకూ నడుమ జరిగినట్టు సాధారణ వివరాలను బట్టి తెలుస్తుంది. లోతుగా చూస్తే రాబర్ట్ క్లైవ్ వ్యాపార విస్తరణ కాంక్షగల వలసవాద శక్తులకు ప్రతినిధి అని గుర్తించగలం. అలాగే సిరాజుద్దౌలా స్వీయ రాజ్యాధికారాన్ని కాపాడుకోవాలనుకునే దేశీయ శక్తులకు ప్రతినిధిగా కన్పిస్తాడు.

కాగా ఈ ఘర్షణలో ఏ శక్తులు విజయం సాధించి కొత్త మార్పులకు దారి తీస్తాయనేది ఆ శక్తుల సామర్థ్యం మీద, పరిస్థితుల్ని తమ కనుకూలం చేసుకోగల తెలివితేటల మీద, వాటి పురోగామి స్వభావం మీద ఆధారపడి ఉంటుంది. ఈ కార్య కారణ సంబంధం లేకుండా సామాజిక చరిత్ర యాదృచ్ఛికంగా పరిణామం చెందదు. చారిత్రక ఆలోచనా విధానం ఈ కార్యకారణ సంబంధాన్ని గుర్తించే సాగుతుంటుంది.

“చరిత్ర యాదృచ్ఛిక సంఘటనల మాల మాత్రమే, అని ఎవరైనా అంటే అతనికి బుద్ధి మాంద్యం ఉన్నదేమోననిపిస్తుంది. నిజమైన చరిత్రకారుడు ఇంతకు ముందు యాదృచ్ఛికం అనుకున్న దాన్ని కాదని హేతుకంగా నిరూపించి, ఆ సంఘటనను ఆనాటి పరిస్థితులకు అనువర్తింపచేయటం సాధారణంగా జరుగుతూ వుంటుంది” (ఇ. హెచ్. కార్ “చరిత్ర అంటే ఏమిటి?”).

పైకి యాదృచ్ఛికంగా కన్పించే సంఘటనలకి కూడా కార్యకారణ సంబంధం వుంటుంది. హేతు బద్ధత వుంటుంది. హేతు బద్ధం కాని చరిత్ర వుండదు. కొంత మంది మేధావులు చరిత్రలో యాదృచ్ఛికంగా కన్పించే కొన్ని కొన్ని అంశాల్ని పట్టుకుని ‘ఇది ఇలా జరగకపోతే?’ ‘జరిగి వుంటే!’ అంటూ అనుమానిస్తూ

యాదృచ్ఛికతను సమర్థిస్తారు. దీన్నే 'క్లియోపాత్రా ముక్కు వాదం' అని ఇ.హెచ్ కార్ ఎగతాళి చేస్తాడు.

అంటే క్లియోపాత్రా ముక్కు మరి కొంచెం పొడవుగా ఉంటే చరిత్ర ఇంకో విధంగా ఉండేదని భావించటం. కాని చరిత్ర ముందుగా ఊహించలేని యాదృచ్ఛిక సంఘటనల మాల కాదు. ఒక అనివార్య గతి చరిత్రలో ఉంటుంది. కాబట్టి చరిత్రలో జరిగే మార్పుల్ని, వాటి కారణాల్ని, ఫలితాల్ని హేతు బద్ధంగా విశ్లేషించటం సాధ్యమే.

ఈనాటి పెట్టుబడిదారీ సమాజంలో ఎటువంటి వ్యక్తి అయినా యాదృచ్ఛికంగా నాయకుడై ఈ సమాజాన్ని హఠాత్తుగా మరో సమాజంగా మార్చలేడు. ఏ నాయకుడైనా చరిత్రకు అతీత వ్యక్తి కాదు. గొప్ప వ్యక్తులు చరిత్రకు వెలుపల అంటే తదంతర్గత సూత్రాలకు లోబడకుండా రూపొందరు. ఒకానొక సామాజిక పరిధిలో కాలం యొక్క సంకల్పాలను వాస్తవీకరించగలిగిన వారే గొప్ప వ్యక్తులు.

"గొప్పవాడు అసాధారణ వ్యక్తి. అతణ్ని సమాజం రూపొందిస్తుంది. అతడు సమాజానికి ప్రతినిధి కూడా. అతణ్ని సామాజిక శక్తులు సృష్టిస్తాయి. కానీ అతడు సామాజిక శక్తులను కూడా సృష్టించగలడు. ప్రపంచ- స్వరూపాన్నీ, ప్రజల ఆలోచనా పద్ధతిని మార్చగలడు". (ఇ.హెచ్ కార్: "చరిత్ర అంటే ఏమిటి?")

ఇదే చారిత్రక నియతి. ఈ చారిత్రక పరిధిలో ఏ వ్యక్తికైనా సాపేక్ష స్వాతంత్ర్యం ఉంటుంది. సాపేక్ష స్వాతంత్ర్యం మాత్రమే ఉంటుంది. ఇలా నిర్దిష్ట స్థలంలో, కాలంలో మానవ చైతన్యం తనను తాను వాస్తవీకరించుకోవటమే చరిత్ర సారాంశం. అంటే ప్రతి చారిత్రక సందర్భంలోనూ కొన్ని మానవ శక్తులు తమ ఆలోచనా విధానానికి ఆచరణ రూపం ఇస్తాయి. ప్రపంచాన్ని మార్చటమే ఆ ఆచరణ.

చరిత్రలోని ఏ మానవుడైనా చారిత్రక మానవుడే. వ్యక్తులు చరిత్రను నిర్మించటం అనేది చారిత్రక చలనానికి ప్రారంభ బిందువు కావటమే గాక ఆ చలనం యొక్క ఫలితం కూడా అవుతుంది (అంటే గొప్ప వ్యక్తులు చరిత్రను నడిపించగలరు. అయితే అలా నడిపించ గలగటానికి చారిత్రక చోదక శక్తులే దోహదం చేస్తాయి.) చరిత్రలో ఏ మహావ్యక్తి ప్రయత్నమైనా చారిత్రక గతి ఫలితమే. కాబట్టి "చారిత్రక సారాంశం అంటే వ్యక్తుల బాహ్యాచరణా (Objective activity), వాస్తవిక సృష్టి (Physical production) ఇదే మనిషిని చరిత్రకు విషయం (subject). చరిత్రను తయారుచేసే వ్యక్తిగా రూపొందిస్తుంది." (F. T Mikhalov : The Riddle of the Self).

ఈ సందర్భంలో మరో మామూలు ప్రశ్న తలెత్తుతుంది. సాహిత్యం గురించి మాట్లాడుకునేటప్పుడు మధ్యలో చరిత్ర ప్రస్తావన ఎందుకు? సాహిత్యాన్ని పరిశీలించేటప్పుడు దాన్ని భిన్నత్వం యొక్క ఏకత్వంగానే అర్థం చేసుకోవాల్సి వుంటుంది. అంటే ఆయా రచయితల రచనలు వేర్వేరుగా కన్పించినా చారిత్రకంగా వాటి ఆవిర్భావంలోనూ, రచనా పరిణామంలోనూ ఒక ఏకసూత్రత ఉంటుంది. ఉదాహరణకు నన్నయ భారతం నుంచి పెద్దన మనుచరిత్ర దాకా కావ్య పరంపరని తీసుకుంటే అందులో పురాణ మార్గం నుంచి కావ్య మార్గం దాకా సాగిన ఒక క్రమబద్ధమైన సాహిత్య పరిణామాన్ని గుర్తించగలం. అదే భిన్నత్వంలోని ఏకత్వం. దీన్ని సరిగా తెలుసుకోవాలంటే సాహిత్య పరిణామాన్ని సామాజిక పరిణామంలో భాగంగా గుర్తించాల్సి వుంటుంది. అది భూస్వామ్య రాచరికం నుంచి సామ్రాజ్యవాద దశలోకి సాగిన పరిణామం. అందువల్ల సాహిత్య చరిత్ర సామాజిక చరిత్రలో భాగమే అవుతుంది.

కాబట్టి సాహిత్యాన్ని స్థలగతమైన ఒక నిర్మాణంగా, కాలగతమైన ఒక కార్య విధానంగా చూడాల్సి వుంటుంది.

మరో విధంగా చెప్పాలంటే సాహిత్యాన్ని ఆయా కాల మాన పరిస్థితులకు అతీతంగా చూడగూడదు. సాహిత్య చరిత్ర నిర్దిష్ట చారిత్రక భౌతిక పరిస్థితులకు అనుగుణంగానే రూపొందుతుంది.

## సాహిత్య చలనం :

పదార్థం నిరంతర చలనంలో ఉన్నట్టే సాహిత్యం సైతం చలనంలో ఉంటుంది. చలన శీలత లేని సాహిత్యం నశించినట్టే.

స్థూలంగా చెప్పుకోవాలంటే చలనం అంటే మార్పు. సాహిత్య చలనం అంటే సాహిత్య పరిణామం. ఒక స్థితినుంచి మరో స్థితికి ఎల్లప్పుడూ కదులుతూ ఉండటం.

సాహిత్య చలనం వస్తు రూపాలు-రెండిటికీ సంబంధించి ఉంటుంది.

సాహిత్యంలో ఎప్పుడూ ఒకే కథావస్తువు కొనసాగదు. రచనా విధానమూ ఒకే విధంగా ఉండదు, సమాజ పరిణామానికి సాపేక్షంగా సాహిత్యంలోనూ కొత్త కొత్త మార్పులు జరుగుతుంటాయి. అందుచేతనే భూస్వామ్య రాచరిక వ్యవస్థలో, సామ్రాజ్యాల కాలంలో, జమీందారీ వ్యవస్థలో, ఆధునిక ప్రజాస్వామ్య యుగంలో వెలువడిన సాహిత్యంలోని కథా వస్తువుల్లో ఎన్నెన్నో మార్పులు కనిపిస్తాయి. సామ్రాజ్యవాద యుగంలో రాజులు కావ్య నాయకులయ్యారు. ఆధునిక కాలంలో వ్యక్తి, వ్యక్తి భావజాలం సాహిత్య కేంద్ర బిందువు అయ్యాయి. అదే విధంగా ప్రాచీన రచనా విధానం, భాషా పద్ధతి మారిపోయి ఆధునిక పద్ధతి వచ్చింది.

సాహిత్య చలనం ఎంతో వైవిధ్య భరితంగా ఉంటుంది. ఆ చలన రూపాలు అసంఖ్యాకంగా ఉంటాయి. వాటి మధ్య అన్యోన్య సంబంధం (interaction) ఉంటుంది. సాహిత్యాభివృద్ధి క్రమంలో రాను రాను మరింత నూతనమైన, మరింత సంక్లిష్టమైన రూపాలు ఉత్పన్నమవుతాయి.

ఒక సాహిత్య రూపం ఉన్నట్టు మరొకటి ఉండదు. ఒక కవి లేదా రచయిత ఒక కథా వస్తువు తీసుకుని రచన చేసినప్పుడు మరొక రచయిత సాధారణంగా దానికి భిన్నమైన వస్తువునే గ్రహిస్తాడు. ఒకవేళ ఏవో కారణాల వల్ల అదే వస్తువును స్వీకరించాల్సి వచ్చినా దాని నిర్వహణలో వైవిధ్యం చూపటానికే ప్రయత్నిస్తాడు. తెలుగులో ఎందరో కవులు తమ భక్తిభావం చేతనో, ఇంకేవో కారణాల చేతనో రామాయణ కథని వస్తువుగా గ్రహించారు. అయితే ప్రతి కవీ తన ప్రత్యేకతని నిలుపుకోవటానికే ప్రయత్నించాడు.

సాహిత్య చలన క్రమంలో దాని పరిధి నిరంతరం విస్తరిస్తుంటుంది. కొత్త కొత్త జీవిత కోణాలు ఆవిష్కరింప బడుతుంటాయి. రచనా విధానాలు అభివృద్ధి చెందుతుంటాయి. సూటి అయిన, సరళమైన విషయాల స్థానంలో ఇంకా ఇంకా సంక్లిష్టమైన జీవిత కోణాలు వెలుగులోకి వస్తాయి. ఉదాహరణకు ప్రాచీన సాహిత్యంలో కథానాయకులు ప్రధానంగా ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరశాంతుడు, ధీరలలితుడు అనే నాలుగు రకాలుగానే కన్పిస్తారు. మరి వర్తమాన సాహిత్యంలో అనుకూల (positive), వ్యతిరేక (negative) లక్షణాలు గల ఏ వ్యక్తులైనా కథానాయకులు కావచ్చు. ఈ సాహిత్యంలో కన్పించే పాత్రలు దాదాపుగా సంక్లిష్ట పాత్రలే. సామాజిక జీవితంలో ఏర్పడిన సంక్లిష్టతే సాహిత్యంలోనూ ప్రతిఫలిస్తున్నది. జీవితంలో అరలు పెరిగినప్పుడు, ఆలోచనలు పెరిగినప్పుడు, ఆలోచనల మధ్య ఘర్షణ పెరిగినప్పుడు, సాధనాలు పెరిగినప్పుడు, సమస్యలు పెరిగినప్పుడు సంక్లిష్టత అనివార్యం అవుతుంది. అది సాహిత్యంలోని వస్తు రూపాలు రెండిటిలో కనిపించటమూ అనివార్యమే అవుతుంది.

సాహిత్య చలనం అనేది సాహిత్యాభివృద్ధి అనే మాట కన్నా విస్తృతమైంది. ఈ చలన ప్రక్రియలో సాహిత్యానికి సంబంధించిన బాహ్య పరిణామాలు, యాదృచ్ఛిక పరిణామాలు మొదలైన అన్ని మార్పులూ చోటు చేసుకుంటాయి. ఈ మార్పులు ఆ చలన ప్రక్రియ అభివృద్ధికి సంబంధించిన అంతర్గత సూత్రాలకు అనుగుణంగా ఉంటాయని చెప్పలేం. అందుకే ఒక్కోసారి కొన్ని సాహిత్య రూపాలు పెను ధోరణి, లేదా తిరోగమన ధోరణిని ప్రదర్శించ వచ్చు. క్షీణ యుగాల్లోని సాహిత్య రూపాల్లో ఈ లక్షణాలే కన్పిస్తాయి. అవి సాహిత్యాభివృద్ధికి ఏ మాత్రం దోహదం చెయ్యక పోగా ఆ అభివృద్ధిని కుంటు పరిచేందుకు దోహదం

చేస్తాయి. అయితే ఈ లక్షణాలను బాహ్య లక్షణాలుగా, తాత్కాలిక లక్షణాలుగా గుర్తించాలి. ఇవి సాహిత్య చలన ప్రక్రియని కొంత కాలం మందకొడిగా చెయ్యగలవుగానీ శాశ్వతంగా స్తంభింప జేయలేవు. క్షీణ యుగాల్లో సైతం తదనంతర సాహిత్యాభివృద్ధికి సంబంధించిన బీజాలుంటాయి. వాటిని గుర్తించ గలిగిన వ్యక్తులు తగిన దోహదం చేసి సాహిత్యాభివృద్ధిని మరింత వేగవంతం చేస్తారు. పందొమ్మిదవ శతాబ్ది చివరి భాగంలో సాహిత్య క్షేత్రంలో కందుకూరి వీరేశలింగం పంతులు గారు చేసిందిదే.

సంప్రదాయ సాహిత్య విమర్శలోని ముఖ్యమైన లోపం, ఆయా కవులు లేదా రచయితల్ని స్థల కాలాలకు అతీతంగా విలువ గట్టటమే. అప్పుడు విమర్శలో యాంత్రిక లక్షణం జొరబడుతుంది సాహిత్యాన్ని 'ఉన్నది ఉన్నట్టుగా' విశ్లేషించే లక్షణం ఇది. సంప్రదాయ విమర్శకులు ఒక కవిలో 'కథా వస్తువు ఇట్లా ఉంది, రసపోషణ ఇట్లా ఉంది, వర్ణనలు, అలంకారాలు ఇట్లా ఉన్నాయి, భాషా విధానం ఇట్లా ఉంది' అని ఒక సులువైన పద్ధతి ప్రకారం సోపపత్తికంగా విశ్లేషిస్తూ పోతారు. దీనివల్ల పాఠకులకు ఆయా రచనలలోని అంశాలు విడివిడిగా తెలుస్తాయి· ఆ విడివిడి అంశాల అన్యోన్య సంబంధం తెలియదు. అంతేగాకుండా ఆ సాహిత్యం ఎందుకట్లా ఉన్నది? అనే విషయం తెలియదు. ఆ కార్యకరణ సంబంధం తెలిసినప్పుడే ఆ సాహిత్యం యొక్క సమగ్ర స్వభావం అర్థమైనట్టు భావించాలి. కాబట్టి ఒక సాహిత్య రూపాన్ని పరిశీలించేటప్పుడు అది పుట్టిన చారిత్రక సామాజిక పరిస్థితుల్ని సమగ్రంగా విశ్లేషించాలి. ఆ పరిస్థితికీ ఆ సాహిత్య రూపానికీ ఉన్న బాహ్యాంతర సంబంధాన్ని అర్థం చేసుకోవాలి. ఆ సంబంధం లేకుండా ఏ రచనా శూన్యంలోంచి ఉత్పన్నం కాదు.

చరిత్రలోని ప్రతి రచనా చారిత్రక రచనే.

సాహిత్యాన్ని చారిత్రక సామాజిక నియతి నుంచి తప్పించినప్పుడు మహా కవులు అతీత వ్యక్తులుగా కనిపిస్తారు. ఆ మహా కవుల కృషి చారిత్రక సామాజిక గతి ఫలితంగా కాక నిరపేక్ష స్వీయ ప్రతిభ ఫలితంగా కనిపిస్తుంది. ఉదాహరణకు తెలుగులో కవిత్వం నన్నయతోనే మొదలైందనీ, నన్నయ ఆనాటికి గానట బీసటగా ఉన్న తెలుగు భాషను సంస్కరించి కావ్యోపయోగ్యంగా రూపొందించి శబ్ద శాసనుడయ్యాడనీ చాలా మంది విమర్శకులు పేర్కొన్నారు. అయితే నన్నయను ఆదికవిగా గౌరవించబోయే ముందు అతని కాలానికి పూర్వమే వెలువడిన అద్దంకి, కందుకూరు, ధర్మవరం, బెజవాడ శిలా శాసనాల్లో (క్రీ.శ. 9, 10 శతాబ్దాలు) కనిపించే పద్య రచనల్ని గౌరవించాలి. వాటిని పరిశీలించినట్లయితే తెలుగు కవిత్వం నన్నయతో మొదలు కాలేదని తెలుస్తుంది. ఆ పద్య ప్రక్రియగానీ, పాల్కురికి

సోమనాధుడు తన 'పండితారాధ్య చరిత్ర'లో పేర్కొన్న పదాలుగానీ తరతరాల సాహిత్యకారుల కృషి ఫలితాలుగానే భావించాలి అంతేగాక లక్షోప లక్షల ప్రజల వాడుకలో ఉన్న భాషను ఏ మహాకవీ శాసించి సంస్కరించలేడు. అసలు భాషను 'సంస్కరించట' మనేదే అసంబద్ధమైన విషయం. తరతరాల ప్రజల వాడుకకీ, (భాష యొక్క) అంతర్గత నిర్మాణానికీ మధ్యగల ఘర్షణని బట్టి భాష నిరంతరం వస్తాశ్రయంగా (objectively) అభివృద్ధి చెందుతుంది. కొంతమంది ఇష్టా నిష్టాలతో దానికి ప్రమేయం లేదు. కొద్దిమంది శాసనాలకు అది బొత్తిగా లొంగదు. చరిత్రను నిర్మించేది ప్రజలే; భాషను నిర్మించేదీ ప్రజలే.

మరి నన్నయ తెలుగు కవిత్వానికి చేసిన కృషి ఏమిటి? ఆయన సంస్కృత పౌరాణిక పద్ధతిని, కావ్య భాషను పండితామోదకరంగా మొదటిసారిగా తెలుగులోకి ప్రవేశ పెట్టాడు. మార్గ పద్ధతిలో కావ్య వ్యవహారానికి రూపురేఖలు దిద్దాడు.

సాహిత్య స్థాయిని అతిశయీకరించినప్పుడు "కవే దేశానికి అసలు నాయకుడు", "కవి మాత్రమే జ్ఞాని, కనక ఎప్పుడూ కవిలో నుంచే జ్ఞానం (చైతన్యం) ప్రజల్లోకి ప్రవహిస్తుంది ఇది మానవ చరిత్రలో ఉండే శాశ్వత సత్యం" (గుంటూరు శేషేంద్రశర్మ: "కవిసేన మేనిఫెస్టో") అనే భావాలు పుడతాయి.

ఇవి కవుల పట్ల అపరిమిత గౌరవంతో చెప్పిన మాటలుగా తోస్తాయి గానీ కవిత్వ పరిమితులను గమనించి చెప్పిన మాటలుగా తోచవు. చరిత్రలో ఏ కవీ ఏ దేశానికీ నాయకత్వం వహించి నడిపించిన దాఖలాలు లేవు. అంతేకాదు. కవిత్వం ఒక జాతి చైతన్యానికి ప్రేరకశక్తి అవుతుంది గానీ చోదక శక్తి కాజాలదు.

కనుకనే మహేతిహాసాలు జన్మించినా వాటిలోని ప్రబోధాన్ని బట్టి సామాజిక గతి ఎన్నడూ మౌలికంగా మారలేదు. కవి జ్ఞాని అనటంలో దోషం లేదు. కానీ సమాజంలో కవి మాత్రమే జ్ఞాని అయితే శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలు మొదలైన మేధావులంతా ఏమవుతారనే ప్రశ్న పుడుతుంది. ఇక జ్ఞానం అనేది కవి నుంచి ప్రజల్లోకి ప్రవహించే ఏకముఖ ప్రవాహం కాదు. ప్రజలకు జ్ఞానం కలిగించే కవి ఆ జ్ఞానాన్ని ప్రజల నుంచే గ్రహిస్తాడు.

'ప్రజల నుంచి ప్రజల్లోకి' అనే సూత్రం ఇక్కడ వర్తిస్తుంది. రచయిత, ప్రజలు రెండు ధ్రువాలైతే ఆ రెండిటి మధ్య చైతన్యం ద్విముఖ ప్రవాహ స్వభావం కలిగి వుంటుంది. అంటే కవి ప్రజల నుంచి చైతన్యం పొందుతాడు. అలాగే ప్రజలు కవి నుంచి చైతన్యం పొందుతారు.

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వాదం ఒకటుంది. సంప్రదాయకులైన ఆలోచనాపరులు కొంత మందికి సాహిత్య స్థల కాల బద్ధతపై నమ్మకం ఉండదు.

వాళ్ళు అత్యుత్సాహంతో వేదాల్లోనే అణువు బాంబు 'ఫార్ములా'ను పసికడతారు. రామాయణంలో పుష్పక విమానం చూపించి, అంతరిక్ష యానంలో అనాడే విప్లవం సాధించిన ప్రాచీనుల విజ్ఞానాన్ని ప్రశంసిస్తారు. భాగవతంలో ధ్రువుడి చరిత్రలో ఖగోళ సూత్రాలను కనిపెడతారు. వరూధినీ ప్రవరుల సంవాదంలోంచి సాపేక్ష సిద్ధాంత సారాంశాన్ని పిండుతారు. ఇది మూలచ్ఛేది పాండిత్యం.

చతుర్వేదాల్లో ఎక్కడా 'అణుధూళి' కన్పించదు. అనాగరిక, పశు పాలక జీవనం గల వైదిక గణాలకి, రంగు రంగుల ఆవుల పాలు ఒకే రంగులో ఉన్నం దుకు ఆశ్చర్యపడ్డ వైదిక విజ్ఞానానికి అణుబాంబు నిర్మాణం అంటగట్టటం కుదరదు. అంత విజ్ఞానాభివృద్ధి క్రీస్తు పూర్వం నాటి భారత దేశంలో జరిగినట్టు చెప్పటానికి ఏ ఆధారాలూ లేవు. రామాయణంలో పుష్పక విమానమైనా అంతే. అంత సాంకేతిక ప్రజ్ఞగల పుష్పక విమానం తన చేతుల్లో ఉన్న వ్యక్తి మామూలు వానరసేన నెందుకు జయించలేక పోయాడు? అనే మామూలు ప్రశ్నతో పుష్పక విమానాన్ని సులువుగా నేల గూల్చవచ్చు! కాబట్టి ఇప్పటి మన పాండిత్యాన్ని ప్రాచీన కవులకు అంటగట్టటం సహేతుకం కాదు. ఒకప్పటి రచయితల రచనలను విలువగట్టేటప్పుడు తత్కాల భౌతిక పరిస్థితుల్నీ, సామాజిక పరిస్థితుల్నీ నిర్దిష్టంగా పరిశీలించాల్సి వుంటుంది. అలా కాకుంటా ఆ రచయితల్ని అప్పటి భౌతిక సామాజిక పరిస్థితుల చట్రానికి అతీతంగా పరిశీలించటం అంటే- వారి అసలైన తత్వానికి అన్యాయం చెయ్యటమే.

**అధి చారిత్రక లక్షణం (Supra-historical Character) :**

సాహిత్యానికి స్థలకాల బద్ధమైన చారిత్రక స్వభావంతో పాటు అధి చారిత్రక లక్షణం కూడా వుంటుంది. అంటే ఒక రచన ప్రత్యేక స్థల కాలాల్లో వెలువడినా సమాజానికి దాని అవసరం ఉన్నంత వరకు అది ఆ స్థల కాలాలను అధిగమించి తదనంతర స్థల కాలాల్లోనూ జీవించగలుగుతుంది.

రామాయణ మహాభారతాలు ఇంకా ఈనాటి సమాజంలో బతికి ఉన్నాయంటే ఈనాటి సామాజిక చైతన్యానికి (అది ఎలాంటిదైనా) వాటి అవసరం ఉందనే భావం. ఆ విధంగా ఆ గ్రంథాలు తాము వెలువడిన స్థలకాలాలను అధిగమించాయని భావం. అయితే ఆ గ్రంథాలు ఎంతో గొప్పవి కాబట్టి అవి త్రికాలాబాధితంగా నిలిచిపోతా యని కొందరు పెద్దలంటుంటారు. ఈ అభిప్రాయం పరీక్షకు నిలవదు. సాహిత్య జీవితాన్ని సాపేక్షంగానే మనం పరిశీలించాలి. ఆ గ్రంథాలు ఇప్పటికి నిలిచి వున్నా

యంటే ప్రస్తుత సామాజిక చైతన్యంతో వాటికున్న సంబంధమే కారణం. ఆ చైతన్యం మారితే భవిష్యత్తులో వాటి అవసరం సమాజాని కుండక పోవచ్చు.

అంతే గాకుండా సాహిత్యం స్థలకాల బద్ధంగా ఉంటుంది అంటే అది కేవలం వర్తమానానికే సంబంధించిందని గ్రహించరాదు. గతం, భవిష్యత్తులేని వర్తమానం ఉండదు. వర్తమాన సంక్లిష్టతని ఆవిష్కరించే సాహిత్యం గత కాలికమైన పునాది నుంచే ప్రారంభమవుతుంది. గత కాలిక మానవానుభవం ప్రాతిపదికపైనే ప్రస్తుత మానవ సంఘర్షణని ప్రదర్శించ గలుగుతుంది. ఆ విధంగా అది భవిష్యత్తులోకి ప్రయాణిస్తుంది. అంటే భవిష్యత్ జనానికి వర్తమాన మానవానుభవ ప్రదర్శన చేసి మార్గదర్శక మవుతుంది. సాహిత్యం గతాన్నీ భవిష్యత్తునూ కలిపే మానవానుభవ సూత్రం. గతం నుంచి భవిష్యత్తులోకి ప్రయాణించే అవిచ్ఛిన్న ప్రవాహం. ఉదాహరణకు గురజాడ సాహిత్యం లేకుండా శ్రీశ్రీ సాహిత్యం ఉండదు. అంటే శ్రీశ్రీ రచనలు గురజాడ ఆవిష్కరించిన మానవానుభవాన్ని మార్గదర్శకంగా గ్రహించే మరింత పురోగమంచాయని గుర్తించాలి.

వర్తమాన సంక్లిష్టతనీ, సంకల్పాన్నీ ఆవిష్కరించని సాహిత్యం వర్తమానానికీ చెందదు, భవిష్యత్తుకీ చెందదు. ఉదాహరణకు ఒక ప్రపంచ యుద్ధమే జరిగే సమయంలో కవి ప్రణయగీతాలో, ప్రకృతి గీతాలో రాస్తూ కూర్చోలేడు. అలా రాస్తే ఆ కవిత్వం వర్తమానానికీ చెందదు. భవిష్యత్తుకీ చెందదు.

తన కాలం యొక్క సంకల్పాలకు వాగ్రూపం ఇచ్చిన రచన, ఆ సంకల్పాలను ఆ కాలానికి తెలియజెప్ప గలిగిన రచన తత్ స్థల కాల బద్ధత నుంచి విస్తరిస్తుంది. భవిష్యత్తులోకి వ్యాపిస్తుంది. భవిష్యత్ తరం తన కాలానికి అవసరమైన అనుభవ పాఠాన్ని ఆ గత వారసత్వం నుంచి గ్రహిస్తుంది. దీనినే కొందరు విమర్శకులు అత్యుక్తిగా 'సార్వకాలికత్వం' అంటారు. అయితే సర్వ కాలాలకూ అవసరమైన రచనల్ని ఏ రచయితా పని గట్టుకుని సృష్టించ లేడు. తన కాలం యొక్క హృదయాన్ని సక్రమంగా ప్రదర్శించిన సాహిత్యమే తదనంతర కాలానికి చెందుతుంది. అలా ఎప్పటికప్పుడు ఆ సాహిత్యం యొక్క అభి చారిత్రక స్వభావాన్ని సాపేక్షకంగా ఆమోదించగలం గానీ ముందుగానే ఆ సాహిత్యం సార్వకాలికమని నిర్ధారించటం కష్టం. రామాయణ భారతాలను సార్వకాలికాలని ప్రశంసించేవారు ఈ పొరపాటే చేస్తున్నారు. వాళ్ళు ఆ ఇతిహాసాల్లో ఈ కాలానికి పనికిరాని అంశాలను తప్పించి, కొద్ది సూక్తుల్ని ఉటంకించి అవి సార్వకాలికాలని సులువుగా నిర్ధారిస్తారు. ఏ రచన అయినా ఈ కాలానికి ఎంత వరకు వర్తిస్తుందన్నది జాగ్రత్తగా పరిశీలించాలి. స్థల కాల బద్ధత నుంచే సాహిత్యం యొక్క అభి చారిత్రక స్వభావం గానీ, సార్వకాలిక భావన గానీ జన్మిస్తాయని గుర్తించాలి.

# సంబంధం

— చిత్ర



చల్లారిపోతున్న పాయసాన్ని చూస్తూ కూర్చున్నాను. ఆలోచనలు ఆగలేకాదు, తేనెటీగలేకాదు. అవి ఒక్కోసారి తుమ్మెదలూ అవుతాయి.

నాలుగు రోజులైంది నేనిక్కడి కొచ్చి.

ఈ యిల్లూ, యీ వాతావరణమూ, మరీ ముఖ్యంగా ఈ మనుషులూ, అంతా కొత్త కొత్తగా వుంది?

కొత్తగానా? ఏమిటన్నానూ? కొత్త గానా?

పుట్టిన వూరు, కన్నతల్లి, కొత్తగా వున్నాయా?

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ"

అది సినిమా పాటేనా?

ఏమో నాకు తెలిసిందంతా అంతే. అది సినిమా పాటే.

"అదేమిటమ్మా . మనీ ! పాయసం తాగనే లేదు!"

అవును తాగనే లేదు. తాగనూలేను.

"ఏమ్మా తాగవు? అయ్యో ! చల్లారే పోయింది"

చల్లారిందా? చల్ల గా అయిపోయిందా?

"వుండు. వెచ్చచెట్టి తీసుకొస్తాను."

"వద్దమ్మా!"

"అదేం మాటమ్మా!"

"చల్లారిపోయిన పాయసమూ, పోగొట్టుకున్న బాల్యమూ...."

వంగుని కప్పు తీస్తున్నదల్లా చివ్వున తలెత్తి చూసింది అమ్మ.

పోగొట్టుకున్నబాల్యం....ఎంత బరువుగా వుందీ మాట!

ఎవరు? ఎవరది? ఎవరు ఆ మాట టన్నది?!

మనోజ్ఞ, మనో, మనీయేనా.... నా మనీ!

"వేడిచేస్తే మళ్ళీరుచి-అదే త'పెలాటబిలిటీ' రావచ్చేమో కానీ, ఆ సౌరభం-ఆ ఒరిజినాల్టీ రాదమ్మా!"

అమ్మా! అమ్మ. అమ్మా. అన్నదా తను?

రెసిడెన్షియల్ స్కూల్లో, ఇంగ్లీషు మీడియంలో పదిహేనేళ్ళు చదివిన తాను-

ఏమన్నాను? అమ్మా అన్నానా? అమ్మ!

నాలో ఈ బరువేమిటి? మాటలకి ఈ తరువేమిటి?

ఏమన్నానూ? ఒరిజినాల్టీ రాదా? పోగొట్టుకున్న బాల్యమా?

నేను పోగొట్టుకున్నానా? ఎవరైనా లాగేసుకున్నారా?

అమ్మ దగ్గరగా వచ్చి గెడ్డం పట్టుకుని మొహం పైకెత్తి-

"మనీ" అంది మెల్లగా, "ఏమిటమ్మా ఏమిటీ ప్రాబ్లం?"

"ఏం లేదమ్మా!"

"నేన్రా మనీ. నేనమ్మా. మమ్మీ."

మమ్మీ! మమ్మీవా? అమ్మా నువ్వు మమ్మీవా?

ఆ పిలుపుకోసంగదూ నువ్వు తపించిపోయింది. ఈ పిలుపుకోసం గదా....

"చెప్పమ్మా. నాకూ్కడా చెప్పకపోతే ఎలాగరా. చెప్పమ్మా."

మరింత దగ్గరగా వచ్చి కూచుంది.

లేదమ్మా! మన మధ్య ఆ దగ్గరితనం లేదు. ఎందుకు ఈ మెనిమూస్తే ఆ సాన్నిహిత్యం కలగదు? ఎందుకు ఆ ఆత్మీయత పుపొంగదు? ఎందుకు? ఎందుకని? ఆ గుండెల్లో తల పెట్టుకు ఏడవాలనిపించదు? ఆ ఒళ్ళో తలపెట్టుకు సేద తీరా లనిపించదు? అసలీవిడ అమ్మేనా! అమ్మే!!

తెల్లటి గౌను వేసుకుని వీధిలోకెళ్ళి బురద చేసుకొచ్చి నేను ఏడిపించిన అమ్మే !!! పదిహేనేళ్ళకాలం నన్ను దూరం చేసిందా?

"ధనం! అమ్మాయిని డిస్టర్బ్ చెయ్యొద్దన్నానా? చదువుకోనియ్యకుండా ఎందుకలా సొల్లు పెడతావు? రా యిటు."

అప్పను. సొళ్ళు సొళ్ళు.

మాట్లాడుకోడం అంటే సొళ్ళు. కష్టాలు పంచుకోడం సొళ్ళు. కన్నీళ్ళు తుడుచుకోడం సొళ్ళు. అభిమానాలూ, ఆప్యాయతలూ- అన్నీ సొళ్ళు సొళ్ళు సొళ్ళు చదువు, చదువొక్కటే. మనకి-

పట్టణానికి దూరంగా, పగలంతా భారంగా, బతికే రెసిడెన్షియల్ స్కూల్‌కి మూణ్ణెళ్ళ కోసారి 'విజిట్' చేసి, వీళ్ళిద్దరూ, ఈ పదిహేనేళ్ళపాటూ అడిగిందేమిటి?

"ఏమ్మా! ఆరోగ్యం బావుందికదా!"

'ఆరోగ్యమూ! ఆరోగ్యం అంటేఅవయవాలు అందంగానూ, ఏపుగానూ పెరగడం కాదమ్మా! సంతోషం కావాలమ్మా! ఆనందం కావాలమ్మా, అని చెప్పనిచ్చేరా అసలు నన్ను-

"కులాసాగా వున్నావు కదమ్మా" అనేవారు.

'కులాసా అంటే, బట్టలు కాదమ్మా! ఐస్‌క్రీములు కాదు. మనసు కులాసాగా వుండాలి. అదీ జివ్వు మనాలి. సముద్రంలా పొంగిపోవాలి. గాలిలా తేలిపోవాలి,-

అనగలిగేనా, అననిచ్చేరా?-

"హేపీగా వున్నావు కదా!ఓకే!" అని తేల్చేసేవారు.

హేపీ. హేపీగా వున్నానా-నేను? లేను నాన్నా. నేను హేపీగా లేను.చిన్న సైకిలు నేర్చుకుంటూ పడిపోయి దెబ్బ తగి తే అమ్మ ఆ దెబ్బలకి సగం కోపంతోనూ, పూర్తి ప్రేమతోనూ మందు రాస్తుంటే, తిడుతుంటే అప్పుడు 'నాన్నా నేను హేపీ'-

అనేంత భాష, భావం నాకు వుం దేవా?

నా ఆరో ఏట, బాగా గుర్తు....సరిగ్గా ఆరో ఏట-

ఈ చిన్నవూళ్ళో చదువు బావుండ దనీ, ట్రాన్సఫర్లు అవుతాయనీ,

చదువురాకపోతే బతుకుబాగుండదనీ, రెసిడెన్షియల్ స్కూల్లో పడేసేరు. అక్కడే పడేళ్ళు- అవును పదేళ్ళు, గడిచిపోయేయి- కాదు. గిడసబారి పోయేయి.

బర్ ర్ ర్ ర్ న ఏదో చప్పుడైంది- గేటు కాబోలు.

"ఎవరు ఇడియట్స్. అంత చప్పుడు ...."అనుకుంటూ బయటికెళ్ళేడు నాన్న.

ఆయనకి మేనర్సంటే ఎంతో ఇష్టం. రోజుకి కనీసం నాలుగైదు సార్లయినా అమెరికానీ, ఇంగ్లండునీ పొగడకుండా వుండలేరు.

"బాబూ! కుబేరం బాబూ! కుబేరం బాబూ !"

ఒత్తుగా కనుబొమలూ, తెల్లగాజుట్టూ, చేతులో చుట్టా, ధృడంగా శరీరమూ ముతక బనీనూ, మాసిన పంచా-ఎవరో పల్లెటూరి ఆసామిలా వున్నాడు.

"నువ్వటోయ్ నాయుడూ, దా. దా"

నాన్న ఇంత ఓర్పుగా వున్నాడూ అంటే ఎవరో బాగా కావలసినవాడూ, మనకి పనికొచ్చేవాడూ అయివుండాలి. మాటల మధ్యలో—

"అమ్మా మనీ. రా. ఇతను,నాయుడని, మన భూములు అవీ చూస్తూ వుంటాడు"

"అమ్మాయి మన పాపేకదండి. నానెప్పుడు ఇనతమేగాని సూడనేదు"

"ఆ.....ఇక్కడలేదు.పట్నంలో రెసిడెన్షియల్ స్కూల్లో చదువుకుంటూ అక్కడే వుండిపోయింది కదా! అందుకే నువ్వు చూడలేదు."

"ఏమి స్కూలు బాబూ?"

"రెసిడెన్షియల్ స్కూలు. అంటే- అక్కడేవుండిపోయి చదువుకోడం అన్న మాట!"

"ఏటి. రాత్రా, పగలా నదువే?" నాయుడికి మా గొప్ప ఆశ్చర్యంగా వుంది.

"ఆ! మరేవిటనుకున్నావు ? మంచి చదువురావాలంటే అలాగే చెయ్యాలి."

"అయితేటి బాబూ! అమ్మా అయ్యా నేనట్టు అక్కడే వుండిపోడమా? సెలవు లకి రాదా?"

"రాదోయ్. సెలవుల్లో కంప్యూటర్ కోర్సులనీ, క్రాష్ కోర్సులనీ, పైచదువు లకి ఎంట్రన్సుకి కోచింగనీ, చాలా తతంగం వుందోయ్.ఖాళీయే వుండదు."

"అయితే బాబు- ఏటి సదివిందండి అమ్మలు?"

"ఎంబీబీ ఎస్సోయ్.డాక్టరు పాసైంది"

"డాక్టరే!!! అమ్మా నమస్కారమమ్మా" రెండు చేతులూ జోడించేడు.

డాక్టరనగానే నాయుడికి గౌరవమో, భయమో కలిగినట్టుంది. ఎప్పుడైనా తనకి జబ్బొస్తే మందిస్తానని ఆశ కలిగిందేమో!

"అయితాకేటి. అమ్మలుకి పెళ్లి శేసీరా?"

ఫక్కున నవ్వాడు నాన్న. "లేదోయ్. అప్పుడే చేసుకోనంటోంది. ఇంకా పై చదువులకి అమెరికాగానీ, ఇంగ్లండు కానీ వెళ్తానంటోంది."

'అబద్ధం! డాడీ ఇది అబద్ధం! నేను అనలేదు. ఆ కోరిక నాకు లేదు.

'నాకు ఇంగ్లండంటే విసుపు. అమెరికా అంటే అసహ్యం. ఆ పరుగుల పోటీలు అంటే చిరాకు. ముఖ్యంగా చదువంటే భయం. నాకు తోడు కావాలి, నాన్నా! విశ్వం కావాలి'.

'నాకు పక్షులు కావాలి, పాటలు కావాలి'

'పచ్చని పొలాలు కావాలి. వెచ్చని ప్రేమలు కావాలి.'

'ఇవేవీ కాదని, నా విశ్వం నుంచి దూరంచేస్తూ, నన్ను తోలేస్తున్నది మీరు- అంతస్తుల వేటలో నన్ను విదేశాలకి తోసేస్తున్నదీ మీరే.'

'నాన్నా. ఇది హిపోక్రసీ కాదు. అబద్ధం. ఎ గ్రాండ్ లై!'

"బాబూ! నాకు తెలకదుగుతానూ. అమ్మాయిని మన సుందరం బాబుకిచ్చి...."

"ఛా. ఎవడు మా అక్కయ్య కొడుకు సుందరానికా? ఛ. ఛ. లేవోయ్. పల్లెటూరు కదా? ఏవో పుకార్లు. అంతే!"

"అదేటి బాబూ! అలాగంతారు? అయిన సంబంధం. అయినా బానే సదివేడుగదా!" "చదివేడోయ్. ఎం.డీ. చదివేడు. కానీ ఏంటి లాభం? ఆ వూరు వొదల్డుట. అక్కడే ప్రాక్టీసు పెడతాట్ట. వేలకి వేలు పోసి, సంవత్సరాల తరబడి చదివించి, దరిద్రులకి సేవలు చేస్తూ ధర్మాత్ముడని పనికిమాలిన బిరుదొకటి తగిలించుకుని అడుక్కుతిండానికా?"

నాయుడికి ఎక్కడో పేగు కదిలినట్టుంది. తత్వం తల కెక్కినట్టుంది. నోట మాట రాలేదు. ప్రాణవాయువు బరువెక్కింది. నేను లోపలికెళ్ళేను.

అవును. ఇంత చదువుకున్నది దరిద్రులకి, అనాధలకి సేవలు చెయ్యడానికి కాదు. అమెరికాకి ఎగిరిపోవడానికి, ఇంగ్లండు పారిపోడానికి. నేను అమెరికా వెళ్ళాలి. బాగా చదువుకోవాలి.

భవిష్యత్తు ఎలా వుంటుందంటే ....

కుమారి లేదా శ్రీమతి మనోజ్ఞ ఎం.డీ. ఎఫ్.ఆర్.సీ.పీ. గారు పొద్దున్న ఎనిమిది నించి ఒంటిగంట వరకూ, మళ్ళీ మధ్యాహ్నం నాల్గునుంచీ రాత్రి తొమ్మిదివరకూ పేషెంట్లని చూస్తారు. అత్యవసర కేసులు అధిక ఫీజులు తీసుకుని అన్నివేళలా చూస్తారు. ఇంటికొచ్చి భోంచేసి పడుకుంటారు. ఆదివారం ఆపరేషన్లు చేస్తారు.

ఆవిడకున్న పారిన్ కారు ఆరు లక్షలు!

ఆవిడ ఇల్లు ఇరవై లక్షలు!

ఆవిడ తీసుకునే ఫీజు మూడొందలు.

ఆవిడ మరో పెద్ద నర్సింగ్‌హోమ్ కడుతున్నారు. మరందుకు డబ్బు కావాలి కదా! అందుకోసం ఆవిడ అక్కర్లేని హిస్టారెక్టమీలు, అదుపు లేకుండా సిజేరియన్లూ చేస్తారు. అసలావిడ పేరే ఆపరేషన్ల డాక్టరు!?....

రాత్రి శ్రీమతి మనోజ్ఞ ఇంటికొచ్చేసరికి, శ్రీవారు క్లబ్బులోనైనా వుం

టాదు- లేదూ వారూ డాక్టరు అయితే, ఆసుపత్రిలో వుంటారు- వారు ఇంటి కొచ్చేక కట్టబోయే నర్సింగ్‌హోంకి కొన బోయే స్థలానికి అవసరమయ్యే డబ్బు గురించి ప్రణాళికలు వేసుకుని అటు తిరిగి పడుకుంటాడు....

"బాబూ! ఈ ఒక్కసాయం సేసి పెట్టండి."నాయుడంత పెద్దవాడు నాన్నని బతిమాలుతున్నాడు.

నాన్న, పల్లెటూళ్ళోవున్న పొలాన్ని అమ్మకానికి పెట్టేట్ట. వేరే వాళ్ళెవరో ఎక్కువ రేటిస్తామని వస్తే నాన్న ఒప్పు కున్నాట్ట. వాళ్ళకి కాకుండా తనకే ఆ భూమి అమ్మమని పట్టుపడుతున్నాడు నాయుడు.

"నువ్వు కొనలేవోయ్ అంత రేటు పెట్టి."

"బాబూ! నా తంటాలేవో నాను పడ తాను. ఆడదాని ఒంటిమీద ఒస్తువులు అమ్మో, మరోటో సేస్తాను. అప్పో, సప్పో సేసి తమ డబ్బుకి నోటు రాని య్యను. నా కాళ్ళెల్లు గడువిప్పించండి" అంటున్నాడు.

"ఎందుకయ్యా! అన్ని పాట్లుపడి ఆ పొలం కొనడం. నీకు తక్కువలో వేరే పొలం దొరుకుతోంది కదా" తేల్చేస్తు న్నాడు నాన్న.

"దొరుకుద్ది బాబూ! దొరుకుద్ది. కానీ బాబూ మీ తండ్రిగారి కాన్నుంచి ఆ పొలం నాను దున్నినాను. అందల కూకుని నాకు వన్నం తిన్నాను. సెల్లా నింటి కాదొగ్గిసి పచ్చాళ్ళితో లతా అందల పడుకుండిపోన్ను. బాబూ! భూమిమీదైనా,అందులోకి...ఆ మట్టిలోకి, ఆ బురదలోకి తమరు దిగనేదు. కాబట్టి, కోపమొస్తే కొట్టేయండి గానీ, ఆ భూమి తోటి మీకు సంబంధం నేకపోవచ్చును. నాకూ ఆ భూమికి ఏభై ఏళ్ళ సంబంధం. ఆ భూమి నాతోని మాటాడుద్ది బాబూ- నాను పిలిస్తే పలుకుద్ది. అందల పంటతిని నాను పెరిగినాను, ఇయ్యాల ఆపొలాన్ని మరొకడి కివ్వడమంటే- బాబూ!- తల్లిని తార్చినట్టుంటాది-"

నాయుడు ఏడుస్తున్నాడా? కేవలం మానసిక సంబంధం కోసం ఎత్తుకెత్తు డబ్బిచ్చి అదికొని అప్పులపాలై పోడాని క్కూడా సిద్ధపడుతున్నాడా?ఏమిటన్నాడు నాయుడు? సంబంధం అన్నాడా?నాన్నకి, తాతకీ అది లేదన్నాడా? ఎంత బాగా అన్నాడు!! వేసవి సెలవుల్లో-సెలవులేనా అవి?.... అప్పుడు మమ్మీ, డాడీ నన్ను చూడ్డానికి స్కూలు కొస్తే—

"డాడీ! నాకు పిన్ని పిల్లల్తో, మావ య్యాల పిల్లల్తో ఆడుకోవాలనుంది"అంటే-

"తప్పమ్మా! ఇక్కడ బోల్డుమంది ఫ్రెండ్సున్నారు కదా! వాళ్ళతో ఆడుకో" అన్నాడు-

"వీళ్ళంతా ఆడుకోరు. డాడీ.ఎప్పుడూ చదువు కబుర్లే. ఎప్పుడూ లెక్కలూ సైన్సు. ఇదే గొడవ. టీచర్లేమో అస్సలు ఆడుకోనివ్వరు...." అని కళ్ళనీళ్ళు తిరి గితే లొంగడానికి ఏ మాత్రం యిష్టంలేని నాన్న ఏమన్నాడు?-

"నేను చెప్తానమ్మా టీచర్లకి- నిన్ను ఆడుకోనిమ్మని!"

"అలాక్కాదు, డాడీ! వాళ్ళంతా మన వాళ్ళుకదూ డాడీ. మన సంబంధీకులు గదా."

"సంబంధం ఏమిటమ్మా! సంబంధం. నువ్వు బాగా చదువుకోవాలి"

"ఎందుకు నాన్నా! ఎందుకు చదువుకోవాలి నాన్నా?" అంటే-

"బాగా చదువుకుంటే మంచి వుద్యోగం వస్తుందమ్మా!"

"మంచి వుద్యోగంవస్తే ఏమవుతుంది నాన్నా?"

"మంచి వుద్యోగం వస్తే నీకు బోల్డు జీతం వస్తుంది. అప్పుడూ- నువ్వు ఎంచక్కా- అన్నీ కొనుక్కోవచ్చు. టీ.వీ., వి.సి.పి, ఫ్రిజ్జూ- అన్నీనీ, ఎంచక్కా పెద్ద కార్లో తిరగొచ్చు. పెద్ద ఇల్లు కట్టుకోవచ్చు. మంచి మంచి బట్టలేసుకోవచ్చు".

ఇలా వూరించి చెల్లించి పోతున్నపుడు—

'నాన్నా! నాకవన్నీ కాదు నాన్నా. మనుషులు, మనుషులు కావాలి నాన్నా. నాకు ప్రేమ కావాలి నాన్నా. మానవ సంబంధాలు కావాలి నాన్నా' అనగలిగేనా అనే ఆలోచన, వూహ, నాకున్నాయా? అంత ఆలోచించే ఓపిక, తీరిక నాకు మిగిలేయా? క్లాస్ ఫస్టు వస్తే గర్వపడడమూ, జబ్బు చేస్తే 'అమ్మ' అని ఏడవడమూ తప్ప, కాంక్రీటు గోడల మధ్య, క్లాసు రూంలో జనరల్ నాలెడ్జి పుస్తకాలతో కుస్తీలో, 'స్కూలు బయట ప్రపంచం ఒకటుం'దనీ, 'అందులో మానవులుం'టారనీ, 'చదువంతా మానవుల కోసమే'ననీ, విశ్వం, గుండెల మీద గుద్ది చెప్పే వరకూ నాకు తెలిసిందా?

పితృశయంలో రాళ్ళ గురించి చదివేను. దాన్ని ఎలా తియ్యాలో నేర్చుకున్నాను గానీ, అవి ఎందుకు తియ్యాలో, ఎవరి కోసం అది తియ్యడం నేర్చుకోవాలో ఆలోచించే తీరిక మిగిలిందీ!

నాయుడు వెళ్ళి పోతున్నప్పుడు నాన్నని ఒప్పించి—

మమ్మీ డాడీలు ఎక్కడికో బయల్దేరుతున్నారు: 'ఎక్కడికమ్మా' అంటే—

ఎర్రం రాజు గారింట్లో పుట్టిన్రోజు పార్టీకట. నాకూ వెళ్ళాలనుంది. కానీ రానివ్వరు. నాకు తెలుసు. చదువుకోవాలి అమెరికా వెళ్ళాలి. వీలైతే అక్కడే వుండిపోవాలి. బోల్డంత సంపాదించాలి. వచ్చెయ్యడం తప్పని సరైతే వచ్చి మరో అమెరికా మోహం వాణ్ని కట్టుకోవాలి. పెద్ద ఆసుపత్రి కట్టి అందర్నీ పిండెయ్యాలి. అందరికీ దూరంగా, ఆప్యాయతలకి దూరంగా, విశ్వంకి దూరంగా వెళ్ళిపోవాలి—

టీ.వీ. ముందు కూర్చున్నాను-

పళ్ళపొడుల దగ్గర్నుంచి, పరుపుల వరకూ, విస్కీలు, బ్రాందీలు అన్ని రకాల చెత్త ఎడ్వర్టయిజ్‌మెంట్లు పేరు మీద అశవాని ఒంపు సొంపుల్ని చూస్తూ రారమ్మని పిలిచేవాళ్ళ దైన్యాన్నీ, పిలిపిస్తున్న వాళ్ళ హైన్యాన్నీ, చూస్తూ- ఇందుకా ఈ టీ.వీలు కొన్నది? 'బాబోయ్! నాకీ వస్తువు లొద్దు, మనుషులు కావా'లని ఏడుస్తుంటే-

రాత్రి అయినట్టుంది-

మమ్మీ డాడీ వచ్చారు.

"మమ్మీ. నీకిష్టమని కాడ్‌బరీస్ తెచ్చాను" అంటాడు నాన్న. ఎప్పుడో తన చిన్నప్పటి ఇష్టాలే తెలిసిన నాన్న. నాకు అపరిచితుడైన నాన్న-

"అయ్యో! అన్నం పెట్టుకు తిన మన్నానే. తిన్లేవా? నీకిష్టమని వంకాయ కూర చేసేను" అంటుంది మమ్మీ. అదంటే నాకు ఎలర్జీ వచ్చిందని తెలీని అమ్మ.

రాత్రి భోజనం అయ్యేక పోస్టంతా చింపుకుని, ఎలాట్ అయిన షేర్లు నోట్ చేసుకోవడం, రిఫండు వారంట్లకి బ్యాంకు చలానాలు, మరుసటి రోజు పెట్టవలసిన షేర్లకి అప్లికేషన్లూ నింపుకోడం... చేస్తాడుట డాడీ-

ఆ సమయంలో గట్టి గట్టిగా కేకలు వేస్తూ ఎవరినో తిడుతున్నాడు.

పదిహేనేళ్ళ క్రితం ఎక్కడో దూరంగా, ఎవరో స్కీం వేస్తే నాన్న నలభై టేకు చెట్లు కొన్నాట్ట. అవి పాతికేళ్ళ పోయాక లక్షలు కురిపిస్తాయని నమ్ముకున్నాట్ట. తీరా ఇవాళ ఆ చెట్లు చచ్చిపోయాయని రాశారట్ట. అందుకు ఆ కంపెనీ వాళ్ళని నానా భాషల్లోనూ తిడ్తున్నాడు.

"అంత కోపం పడకపోతే ఒకసారి ఆ వూరెళ్ళి నిజంగా ఆ చెట్లు చచ్చిపోయాయో లేదో, అవి మన చెట్లు అవునో కాదో చూసి రావాదుటండీ" అంటోంది మమ్మీ.

"ఎలా? ఎలా ధనం? ఎలా చూడ్డం? మనం పెట్టుబడి పెట్టాం కానీ, ఏ చెట్టు మనదో, మనకెలా తెలుస్తుంది? ఎప్పుడో పదిహేనేళ్ళ క్రితం వేసిన నెంబర్లు ఇంకా వుంటాయా? చెట్టు బెరడు కట్టదా? ఆ పొలం చూడలేదు. అన్ని చెట్లూ ఒక్కలాగే వుంటాయిగదా! ఎలా మన చెట్లు గుర్తుపట్టడం? కేవలం మనం డబ్బు కట్టాం. పెట్టుబడి పెట్టాం. అంతే ముంచేశారు...."

"పోనీలెండి. ఆ చెట్లు పోతే మళ్ళీ మొక్కలు పాతుకోవచ్చు."

"నా శ్రాద్ధం... నీపిండాకూడు. మనకి కేవలం ఆ చెట్లమీదే కానీ అవి పెరిగే భూమి మీద హక్కు లేదు...."

నాకు తెరలు తెరలుగా ఏడుపొస్తోంది. కెరఠళ్ళు కెరఠళ్ళుగా నవ్వొస్తోంది.

డబ్బు పెట్టుబడి పెట్టి లాభాల కోసం చూశావు. కానీ డాడీ! ఏనాడైనా ఒక బొట్టెడు నీళ్ళు పోసేవా? గంపెడుగెత్తం వేసేవా? కనీసం ప్రేమగా చెయ్యివేసి నిమిరేవా, నాన్నా! పెరుగు, పెరుగు అన్నావేకానీ ఆ మొక్కలు, వాటితో- నాయుడేమన్నాడూ- 'పొలం నేను పిలిస్తే పలుకుతుంది' అన్నాడు. స్థాయి పడి నిద్రలకుపక్రమించేరు. మమ్మీఅంటుంది డాడీతో:

"మనీ వరస నాకేం బోధపడటం లేదండీ. ఏం మాట్లాడదు. చనువుగా వుండదు. ఏదో కొత్త యింటికొచ్చినట్టు ఆలోచిస్తూ కూచుంటుంది. తనకు ఏవి యిష్టమో చెప్పదు. నాకు తెలీదు...."

అవును మమ్మీ,తెలీదు. అది నీతప్పు

కాదు. చదువు యావలో పదిహేనేళ్ళు దూరంగా తోసేసే, సెలవుల్లో కూడా ఇక్కడికి రాకూడదనీ, వస్తే ఈ వాతావరణం నన్ను చెడగొట్టేస్తుందనీ జాగ్రత్తలు తీసుకున్నారే, అదీ మీ తప్పు కాదు. నా చదువు తెచ్చే లక్షలు కావాలి తప్ప ఇంత ప్రేమ, ఆప్యాయత ఏదీ వద్దు ఇంత దూరంగా వున్ననన్ను భౌతికంగా గుర్తుపట్టేవు కానీ మానసికంగా మర్చిపోయావమ్మా. నా రుచులూ, ఇష్టాలే కావు. నా ఆనందాలూ, హాబీలూ ఏవీ మీకు తెలీవు. నా శరీరం ఒడ్డూ పొడుగులు, టేకు చెట్లలాగ, మీకు తెలుసేమో గానీ నా మనసు లోతులు తెలీవమ్మా. మనం ఈ రోజు అపరిచితులం మాత్రమే కాదు ఆత్మ విరోధులంకూడా.

ఆలోచనల్లోనే నిద్ర పట్టినట్టుంది. భయంకరమైన కల.

ఎవరో పుస్తకాలు త్రాసులో వేసేరు. నేను నా మెదడుని మరోపక్క వేసేను. ఈలోగా నా హృదయం నేలమీదజీరాడుతోంది. ఎవరో పుస్తకాలు తీసేసి డబ్బు కట్టలు వేస్తున్నారు. ఇంకా ఇంకా ఎన్నో కట్టలు. హఠాత్తుగా మెదడు గాలిలోకి తేలిపోడం మొదలెట్టింది. ఎవడో డాక్టరొచ్చి కంప్యూటర్‌తో పరీక్షించేడు. 'దీనికి హృదయంతో సంబంధం లేదు. తెగిపోయింది. పనికిరాదు. పారెయ్యండి' అంటున్నాడు. ఎవరో ఎత్తి నన్ను మురుక్కాలవలోకి రయ్యిన విసిరే....

వులిక్కిపడి లేచేను. దాహం దాహం. మంచినీళ్ళు తాగేను - నిద్ర పట్టలేదు. లైటు వేసి ఉత్తరం మొదలెట్టాను-

"ప్రియతమా! విశ్వం,

"నీతో పందెంలో నేను ఓడినా బతుకులో గెలిచాను. నువ్వు అన్నట్టుగానే ఇక్కడ నాకంతా కొత్తగానూ, పరాయిగానూ వుంది. ఇక్కడ పుస్తకాలన్నీ డబ్బు వాస నేస్తున్నాయి. జీవితం పునాది మీదికి నన్ను దింపినందుకు కృతజ్ఞతలు చెప్పనా? రోబోకి అనుభూతులు నేర్పి ప్రాణం పోసిన నీకు నన్నే అర్పించుకోడం కంటే ఏం చెయ్యగలను భ్రమలు విడిపోయేయి".

"నువ్వన్నట్టే పోదాం. ఎక్కడ విజ్ఞానం వికాసానికి తోడ్పడుతుందో అక్కడికే పోదాం. మన శ్రమ ఇతరుల శ్రమని తగ్గించాలి గానీ ఇతరుల శ్రమని దోచుకోడానికి కాదు అన్నది ఎంత బాగా అన్నావు ?"

"నాకు ఆశయాలు తెలీవు. ఎక్కడ కనీసం నా శ్రమ ఫలితం నేను అనుభవించగలనో, ఎక్కడ వస్తువుల కంటె మనుషుల కెక్కువ విలువవుందో అక్కడికే పోదాం-

"వస్తున్నాను. నీతో కలసి గడిపే ఆహ్లాదకరమైన సాయంకాలం కోసం. నీతో పంచుకునే విశ్రాంతి గల రాత్రుల కోసం."

# ఒకానొక బాల్యపు దృశ్యం

— ఖండ్ల మాధవరావు

నిద్ర కోరిగిన నా కనురెప్పలలో
ఎంత కాదనుకొన్నా వాడి అమాయక ముఖం
నా కళ్ళ ముందు తచ్చాడుతోంది
కన్నవాళ్ళకి గుదిబండ అయిన వాడు
గేదె మెళ్ళో తమ్మె అయ్యాడు
పాచి నోటితో పేడ పుస్తకాన్ని దీక్షగా చదువుతుంటాడు
పొలాల్లో కొడవలితో గడ్డి అక్షరాలు దిద్ది దిద్ది
వాడి చేతులు మొద్దుబారి పోయాయి
సుంకు పోసుకున్న కాటుక కంకి వాడు
నిద్ర మత్తులో రోకలి పోటు వేస్తూ
వాడి జీవితాన్నే రోట్లో పెట్టాడు
తుమ్మ ముల్లో జొన్న దుంపో గుచ్చుకున్న వాడి బాల్యానికి
ఇటుక రాయి కాపడం పెడుతుంటాడు
వగిడాకైన వాడి చిన్నతనం
ఏ ముళ్ళ కంచెకో పట్టి చీరుకుపోయింది
వాడి హైన్యాన్ని దైన్యాన్ని చూసి రాల్చడానికి
రెండు కన్నీటి చుక్కలు కూడ కరువయ్యాయి నాకు
గేదెలు రేపిన దుమ్ములో అక్షర జ్యోతి నినాదం
అలుక్కుపోయి కనబడుతోంది
వాడి పసితనం మాత్రం చిన్నబోయి దుఃఖంతో వెక్కి వచ్చి
గోధూళి వేళ దుమ్ములో కలిసి పోతోంది
ఇపుడు గేదెల కాడ వున్నోడు
రేపు ఎడ్ల కాడికి పదోన్నతి పొందుతాడు
గాటికి బిగించిన రాయి
అయిపోతుంది వాడి జీవితం

# మహిళలు - సామ్రాజ్యవాదం - పర్యావరణం

— కాత్యాయని

భారత దేశపు నేపథ్యంలో "మహిళలు-సామ్రాజ్యవాదం-పర్యావరణం" అనే ఈ అంశాన్ని చర్చించడంలో కొంత సంక్లిష్టత వుంటుంది. ఎందుకంటే భూస్వామ్య భావజాలం బలంగా వున్న ఈ సమాజంలో స్త్రీలు ప్రధానంగా కుటుంబమనే ఒక ప్రైవేటు ప్రపంచానికి చెందిన వాళ్ళుగా నిర్వచించబడతారు. సమాజంలో వాళ్ళ స్థానాన్నీ, వాళ్ళ "స్త్రీత్వా"న్నీ నిర్ణయించే పని పురుషుల అవసరాల వైపు నుంచి జరుగుతుంది. సామాజిక రంగంలో పని చేస్తున్న స్త్రీలకైనా, వాళ్ళకి కేటాయించబడ్డ పనులూ, ఉద్యోగాలూ కూడా కుటుంబంలో తల్లులుగా, గృహిణులుగా వాళ్ళు నిర్వర్తించే విధులకు పొడిగింపులుగానే వుంటాయి. లేకపోతే ఏ గవాళ్ళు చేసే పనులకు సహాయకారులుగా, నైపుణ్యం లేని వాళ్ళుగా పరిగణింపబడతారు. ఇలా ఇంటా బయటా స్త్రీల కెదురయ్యే సమస్యల్లోని పురుషాధిపత్యంలో భూస్వామ్య భావజాలం స్పష్టంగా కన్పిస్తూ వుంటుంది. కానీ సామ్రాజ్యవాద విధానాల ప్రభావం స్త్రీల జీవితాలపై వుండటమనే విషయం అంత స్పష్టంగా కన్పించదు. ఒకవేళ కన్పించినా స్త్రీల విద్య, ఉద్యోగావకాశాలపై, వేతనాలపై కొంత వరకు కన్పిస్తుంది కానీ, వాళ్ళ లైంగికత్వాన్ని కంట్రోలు చేయడంలోనూ, కుటుంబ సంబంధాలను నిర్ణయించడంలోనూ కూడా పని చేస్తుందనేది మాత్రం అస్పష్టంగానే వుండి పోతుంది. దీన్నర్థం చేసుకోవాలంటే మూడవ ప్రపంచ దేశాలపై సామ్రాజ్యవాదానికున్న పట్టునూ, సామ్రాజ్యవాదం తన వలసలుగా వున్న వెనకబడిన దేశాల్లోని భూస్వామ్య విధానంతో లాలూచీ పడే పద్ధతినీ, దాన్ని వ్యవస్థీకృతం చేయడంలో దళారీ బూర్జువా వర్గం పాత్రనూ అర్థం చేసుకోవాలి. అంటే ఈ దేశానికున్న అర్ధవలస- అర్ధ భూస్వామ్య స్వభావాన్ని అర్థం చేసుకోవాలి.

అలాగే, పర్యావరణానికీ, స్త్రీలకూ వున్న సంబంధాన్ని అర్థం చేసుకోవాలనుకున్నా ముందుగా పర్యావరణ సమతౌల్యానికీ, మానవాళి మనుగడకు వున్న సంబంధాన్నీ, పర్యావరణ కాలుష్యానికి కారణమౌతున్న సాంకేతిక రంగాల విధానాలు దోపిడీ వర్గ ప్రయోజనాలకు ఉపయోగపడుతున్న విధానాన్నీ, ముఖ్యంగా ఆ రంగాలపై సామ్రాజ్యవాదానికున్న అదుపునూ కలిపి అర్థం చేసుకోవాల్సి వుంటుంది. ఆ తర్వాతే పర్యావరణ కాలుష్యం వల్ల శ్రామిక వర్గం ఎదుర్కొనే ప్రత్యేకమైన సమస్యల్లో భాగంలోనూ, అదనంగా పితృస్వామ్య విధానం వల్లనూ, స్త్రీల కెదురయ్యే సమస్యలు అర్థమవుతాయి.

బ్రిటీషు వలస పాలనకు ముందు భారతదేశంలోని స్త్రీల ప్రధాన సమస్య లన్నీ వర్ణ వ్యవస్థతోనూ, దీన్ని నిలబెట్టే మతంతోనూ ముడిపడినవిగా కన్పిస్తాయి. పితృస్వామిక భావజాలాన్ని చట్టబద్ధం చేయడానికి భూస్వామ్య సమాజంలో ప్రధాన సాధనంగా పని చేస్తుంది మతం. స్త్రీని శారీరకంగా, మానసికంగా బానిసను చేసేం దుకు తయారు చేయబడ్డ పాతివ్రత్య భావజాలం ధర్మ శాస్త్రాల ద్వారా చట్టబద్ధం అవుతుంది. పురాణాలూ, ఇతిహాసాలూ దాన్ని ఆదర్శీకరించి స్త్రీలు తమకు తాముగా లొంగిపోయే వాతావరణాన్ని తయారు చేస్తాయి.

బ్రిటీషు పాలన ప్రారంభమయ్యాక బాల్య వివాహాలు, వితంతు సమస్య, కన్యాశుల్కం, సతీ సహగమనం లాంటి దురాచారాలకు వ్యతిరేకంగా సంస్కరణోద్యమాలు రావటం, ఆ సమస్యల నుంచి స్త్రీలు కొంత వరకు బయటపడటం కన్పిస్తుంది. ఈ రకమైన ఉద్యమాలకు బ్రిటీషు ప్రభుత్వం మద్దతు నిచ్చింది కూడా. భూస్వామ్య సమాజంలోని స్త్రీల స్థితితో పోల్చుకున్నప్పుడు ఆడవాళ్ళ మీద అమలయ్యే కొన్ని దురాచారాలు కొంత మేరకైనా తగ్గటమూ, వాళ్ళు చదువుల్లోకీ, ఉద్యోగాల్లోకీ ప్రవేశించటమూ తప్పకుండా అభివృద్ధి కరమైన మార్పే, ఐతే ఈ మార్పు పితృస్వామ్యం నుంచి స్త్రీలను పూర్తిగా విముక్తం చెయ్యగలిగే శక్తి కలిగింది మాత్రం కాదు. ఎందుకంటే వర్గ వ్యవస్థపై ఆధారపడిన ఏ ప్రభుత్వమూ స్త్రీలను సమాన వ్యక్తులుగా గుర్తించే పని చెయ్యదు. పితృస్వామ్య వ్యవస్థను నిర్మూలించడమనేది వర్గ పునాదితో ముడిపడిన మౌలికమైన అంశం కాబట్టి. నిజానికి సంస్కరణోద్యమాలన్నీ స్త్రీల సమస్యకు పైపైన ఉపశమనాన్ని వెదికే కార్యక్రమాలే తప్ప, పితృస్వామ్యాన్ని మొదలంటా నిర్మూలించే ప్రణాళిక కలవి కావు. అందుకే అలాంటి సంస్కరణలకు మద్దతు నిచ్చే పాలక వర్గాలు, వర్గ పోరాటంలో భాగంగా సాగే స్త్రీ విముక్తి ఉద్యమాలపై తీవ్రమైన అణచివేతను ప్రయోగిస్తాయి.

బ్రిటీషు సామ్రాజ్యవాదులు మొదట్లో భారతదేశంలోని అగ్ర వర్ణాలకూ, భూస్వామ్య వర్గాలకూ వ్యతిరేకత కల్గించే చర్యలు తీసుకునేందుకు విముఖంగానే వున్నారు. తన వలసల్లోని భూస్వామ్య వర్గాలతో ఏకమవడం ద్వారా, తన అధికారాన్ని సుస్థిరం చేసుకోవటమనేది సామ్రాజ్యవాదపు లక్షణం. అందుకే "భారతీయుల మనోభావాలను గౌరవించడం" పేరిట యిక్కడి మతపరమైన దురాచారాల విషయంలో కానీ, విద్యారంగంలో కానీ, బ్రిటిష్ పాలకులు కల్పించుకోలేదు. ఐతే, సంస్కరణోద్యమాలకు మద్దతు నివ్వడంలో పాలకుల రాజకీయ ప్రయోజనాలు యిమిడి వున్నాయి. కొత్తగా మళ్ళీదేశంలో స్థాపించే పరిశ్రమల్లో పని చెయ్యటానికి అత్యధిక సంఖ్యలో శ్రామికులు అవసరమవుతారు. భూస్వామ్య సమాజంలో లాగా స్త్రీలు కుటుంబాలకు పరిమితమయ్యే పరిస్థితి వుంటే తమ కవసరమైన శ్రామికులు

దొరకడం కష్టమవుతుంది. స్త్రీలనుకూడా చదువుల్లోకి. ఉద్యోగాల్లోకి ప్రవేశపెట్టడం ద్వారా, శ్రామికుల్లోపోటీ పెరుగుతుంది. దీన్ని ఉపయోగించుకుని, రెండవ తరగతి పౌరులుగా వుండే స్త్రీలను తక్కువ వేతనాలతోనే శ్రామికులుగా ఉపయోగించుకోవచ్చు. మరో కారణం తమ దేశంలో తయారయ్యే ఉత్పత్తులను అధిక ధరలకు అమ్ముకోవటానికి వీలుగా వినియోగదారుల్ని తయారుచేసుకోవడం కూడా.

1947లో జరిగిన అధికార మార్పిడి తర్వాతకూడా భారత పాలకులు బ్రిటీషు వారు ప్రవేశబెట్టిన విధానాలనే అనేక రంగాల్లో అనుసరించడం కొనసాగుతోంది. జాతీయోద్యమంలో ప్రధాన పాత్ర వహించిన దేశీయ బూర్జువా వర్గం సామ్రాజ్యవాద దళారులుగా స్థిరపడటం, భూమిపై కొద్దిమంది ఆధిపత్యమే కొనసాగుతూ వుండటం లాంటి పరిణామాలన్నీ కలిపి భారతదేశానికి అర్ధవలస-అర్థ భూస్వామ్య స్వభావాన్నిచ్చాయి

70ల నుంచీ దేశంలో విపరీతంగా పెరుగుతూ వచ్చిన ఆర్థిక సంక్షోభం పాలక వర్గాల్లో తీవ్రమైన కలవరాన్ని రేపుతూ, ప్రజలను మభ్యపెట్టే రకరకాల ప్రణాళికలను ముందుకు తెస్తోంది. ఇందులో తాజా పరిణామం 'నూతన ఆర్థిక విధానం.'

భారత దేశపు ఆర్థిక వ్యవస్థలోని రుగ్మతలకు చికిత్సగా ఈ నూతన ఆర్థిక విధానం పని చేస్తుందంటున్నారు పాలకులు. ఆ విధానంలోని అంశాలు:

1) రూపాయి విలువ తగ్గింపు
2) ఆర్థిక వ్యవస్థ మొత్తాన్ని ప్రైవేటీకరించడం
3) ప్రైవేట్ వ్యక్తుల లాభార్జనపై వున్న కొద్దిపాటి నిబంధనలనూ యింకా సడలించడం
4) ఉదార విధానాలతో ప్రపంచ పెట్టుబడిదారు లందరినీ ఆహ్వానించటమూ, భారతదేశపు ఆర్థిక వ్యవస్థను ప్రపంచ పెట్టుబడిదారీ రంగంలో భాగంగా చేయడమూ— (Globalisation)

నిజానికి మార్పులు ఇవాళే కొత్తగా ప్రవేశిస్తున్నవేమీ కాదు. అంతర్జాతీయ వాణిజ్యంలో మారకం జరిగేటప్పుడు మన రూపాయి విలువ, ఇప్పటికీ 20% తక్కువగా వుంది. ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలూ, సంస్థలూ ప్రైవేటు వ్యక్తుల పరమవటం- ముఖ్యంగా కొన్ని కుటుంబాల ఆధీనంలో దేశ ఆర్థిక వ్యవస్థ కేంద్రీకృతం కావటం మొదటి నించీ కొనసాగుతున్నదే. ఐతే కొన్ని ప్రధానమైన రంగాలను ప్రైవేటుపరం చేయకూడదని యిప్పుడున్న నిబంధనలుకూడా ఈ విధానంవల్ల తొలగిపోతాయి. అలాగే ధరలపై అమ్మకాలు, పెట్టుబడుల, ఉత్పత్తుల పరిమాణాలపై యిప్పుడున్న కొద్దిపాటి నిబంధనలు కూడా తొలగిపోతాయి. మనం దిగుమతి

చేసుకునే విదేశీ ఉత్పత్తులపై పన్నులు రద్దు చేయటం, దిగుమతులపై ఆంక్షలనింకా సడలించడం ద్వారా మన ఆర్థిక రంగంలోని విదేశీ ఉత్పత్తులు మరింత యథేచ్ఛగా ప్రవేశిస్తాయి. ఈ నూతన ఆర్థిక విధానం సామ్రాజ్యవాదుల ఏజెంట్లుగా వ్యవహరించే ప్రపంచబ్యాంకు, ఐ.యం.యఫ్.ల ఆదేశాలమేరకు రూపకల్పన చేయబడినదే.

భారతదేశం రుణాల భారంతో దిక్కుతోచని స్థితిలో వున్నందున ఈ ఆర్థిక విధానం దానికి పరిష్కారమవుతుందని పాలకులు చెప్తున్నారు. రూపాయి విలువను ఇంకా తగ్గించటంవల్ల మనం ఎగుమతి చేసే వస్తువులు చౌకగానూ, దిగుమతి చేసుకునేవి అధికధరలతోనూ వుంటాయికదా అనే ప్రశ్నకు, దీనివల్ల దిగుమతులు తగ్గి, ఎగుమతులు పెరుగుతాయనీ, తద్వారా దేశం అభివృద్ధి చెందుతుందనీ బుకాయిస్తున్నారు కూడా. ఐతే మన ఎగుమతుల్లో ముఖ్యస్థానాన్నాక్రమించిన దుస్తులూ, ఇంజినీరింగ్ ఉత్పత్తుల్లాంటి వస్తువుల ఎగుమతులపై ఇతర దేశాల్లో పరిమితులున్నాయి కాబట్టి కొత్తగా ఎగుమతులు పెరగడం సాధ్యం కాదు.

ఇక ఈ నూతన ఆర్థికవిధానం మహిళలనెలా ప్రభావితంగాచేస్తుందో చూస్తే- ఈ విధానం ప్రధానంగా వ్యవసాయేతర రంగానికి సంబంధించినది. ఆ రంగంలో స్త్రీల పరిస్థితి ఇప్పటికే అంతంత మాత్రంగా వుంది. ఇక ప్రైవేటు పరిశ్రమలు మరింత పెరగటంవల్ల అంతకుముందున్న ప్రభుత్వరంగ సంస్థలు మూతపడి ప్రజల్లో నిరుద్యోగం పెరుగుతుంది. ఆధునికమైన కొత్త పరిశ్రమల్లో సాంకేతిక పరికరాల వాడుక ద్వారా శ్రామికుల సంఖ్యను తగ్గించుకుంటారు. ఇక మిగిలిన కొద్దిపాటి అవకాశాల్లోనూ మనదేశపు స్త్రీల విద్యార్హతలు పరిమితం కాబట్టి వాళ్ళకు ప్రాధాన్యత లేని ఉద్యోగాలు మాత్రమే దక్కుతాయి. ఎలక్ట్రానిక్ రంగంలో విడిభాగాల తయారీ లాంటి పరిశ్రమల్లో స్త్రీలు పని చేస్తున్నా, అందులో ఉపాధి భద్రతలేని కాజువల్ కార్మికులుగా మాత్రమే వాళ్ళుంటున్నారు. మళ్ళీ ఈపాటి అవకాశాలు కూడా గ్రామీణ ప్రాంతాల స్త్రీలకు అందుబాటులో వుండవు. పైగా ఈ పరిశ్రమలన్నీ నగరాల్లో కేంద్రీకృతం కావడంవల్ల గ్రామాల నుంచి వలస పొయ్యే ప్రజలు అధికమై పోటీ పెరుగుతుంది. కుటుంబాల ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తమై స్త్రీలు ఎంత ఎక్కువ శ్రమకైనా కొద్దివేతనాలతోనే స్థిరపడాల్సి వస్తుంది. అలాంటి స్థితిలో పనిచేయాల్సిన స్త్రీలపై యజమానుల లైంగిక వేధింపులు సాగించడం మరింతగా సులభమవుతుంది.

పరిశ్రమల రంగంలో స్త్రీల పాత్ర పెరిగినట్టుగా కన్పించినా అవి ప్రాధాన్యత లేని ఉద్యోగాలుగానే వుంటున్నాయి. సరళీకృత విధానంవల్ల ఆధునిక టెక్నాలజీని, మిషనరీని దిగుమతి చేసుకోవడంవల్ల సంప్రదాయక విధానాల్లో గ్రామీణ స్త్రీలు నిర్వహించిన మట్టి పాత్రలు చేయడం, బుట్టలల్లటంలాంటి చేతివృత్తులు మూతపడి

వాటికి ప్రత్యామ్నాయసరుకులు తయారవుతున్నాయి. ఆ సాంకేతిక నైపుణ్యం లేక పోవడంతో స్త్రీలు ఆ పరిశ్రమల్లో ఉద్యోగాలకు అర్హతలేని వాళ్ళవుతున్నారు.

చివరికి వ్యవసాయ రంగంలో కూడా అంత వరకూ స్త్రీలు చేసే విత్తనాలు చల్లటం, నూర్చటం, మందులు చల్లడంలాంటివి కొత్త సాంకేతిక నైపుణ్యంద్వారా ఆధునిక యంత్రాల సహాయంతో జరుగుతున్నపుడు పురుషుల పరమవుతాయి.

నూతన ఆర్థిక విధానంవల్ల ఎలాంటి కార్మికచట్టాలను అమలుచేసే అవసరం లేని ఎగుమతి సంస్థలను ప్రోత్సహిస్తారు. ఆ సంస్థలు తక్కువ వేతనాల నివ్వటమే కాక పర్మనెంట్ కార్మికులను తీసుకోరు. తాత్కాలిక కార్మికులుగా నియమించటం వల్ల వాళ్ళకివ్వాల్సిన ప్రావిడెంట్ ఫండ్, ఆరోగ్య భీమాలాంటి సదుపాయాలకయ్యే ఖర్చును మిగుల్చుకుంటారు. ఇలాంటి పరిస్థితుల్లో పని చేసేందుకు స్త్రీలు తప్పని సరిగా సిద్ధపడాల్సి వస్తుంది- ఆర్థిక ఇబ్బందుల కారణంవల్ల.

ఇక పెరుగుతున్న నిరుద్యోగంవల్ల ప్రజల్లో కలిగే అసంతృప్తిని పక్కదారి పట్టించి తమకు ముప్పురాకుండా చూసుకునే అవసరం ఏర్పడుతుంది పాలకవర్గాలకు. అందుకే స్వయం ఉపాధి పేర గ్రామాల్లోని స్త్రీలకు పాడి పరిశ్రమ, చేతివృత్తుల తయారీలాంటివి సహకార సంస్థలద్వారా ఏర్పాటు చేస్తున్నట్లు కన్పిస్తున్నా, వాటిలో తక్కువ వేతనాలకు ఉద్యోగ భద్రతలేని పరిస్థితుల్లో పనిచెయ్యాలి. పైగా ఆ రకం పథకాలు అతి కొద్ది కాలంలోనే నష్టాలపేర అర్థాంతరంగా మునిగిపోతాయి. బీడీలు, చుట్టలు, ఆహారోత్పత్తులు తయారుచేయడం లాంటి పరిశ్రమల్లో గ్రామీణ స్త్రీలు అధికంగా పనిచేస్తున్నారు. ఐతే, యిందులో ముడిపదార్థాలను ఇళ్ళకుతెచ్చి వస్తువులు తయారుచేసి అప్పగించే కాంట్రాక్టు పద్ధతి వుంటుంది. అందువల్ల అది పూర్తికాలపు పనిగా పరిగణించబడక, తక్కువ వేతనాలతోనే సరిపెట్టేస్తుంటారు యజమానులు. వీటిలో అలవెన్సులూ, సెలవులూలాంటి సౌకర్యాలులేవు. భవన నిర్మాణం లాంటి అసంఘటిత రంగాల్లో కూడా గ్రామాల నుండి వలస వచ్చిన స్త్రీలు పనిచేస్తున్నారు. వీళ్ళకి ఎలాంటి కార్మిక చట్టాలూ, సౌకర్యాలూ వుండవు.

ఈ ఆర్థిక విధానంలోని మరో లక్షణం-కొన్ని రంగాల్లోని సబ్సిడీలపై కోత విధించడం. ఆ కోతలు కూడా ముఖ్యంగా విద్య, ఆరోగ్యం, శిశు సంక్షేమంలాంటి రంగాలపైనే విధించడం వల్ల స్త్రీలు మరింత దుర్భర స్థితిలోని చేరుతున్నారు.

ఇప్పటికే మన సమాజంలో కొనసాగుతున్న భూస్వామ్య భావజాలం వల్ల స్త్రీల విద్యావకాశాలు తగినంతగా పెరగడం లేదు. ఇప్పుడు విద్యా రంగంపై సబ్సిడీలు తగ్గించి ప్రైవేటు పరం చేయటం వల్ల చదువుల కోసం ఖర్చు చేయాల్సిన మొత్తం పెరిగి మధ్య తరగతి శ్రామిక వర్గాలకు భరించలేని భారమవుతుంది. దాంతో ఆ వర్గాల నుంచీ, దళిత కులాల నుంచీ చదువులకు వచ్చే వారి సంఖ్య తగ్గిపోతుంది

అందులోనూ స్త్రీల సంఖ్య మరింతగా పడిపోతుంది. స్త్రీల అంతిమ లక్ష్యం పెళ్ళి, కుటుంబం మాత్రమే అనే అభిప్రాయం ప్రచారంలో వుండటం వల్ల ఆడపిల్ల చదువు పెళ్ళికి అవసరమైన ఒక అర్హతగా వుంటుందే తప్ప, పెద్ద ప్రాధాన్యత కలదిగా వుండదు. అంతకంతకూ పెరుగుతున్న వరకట్న సమస్య కూడా విద్యా రంగంలో స్త్రీల అభివృద్ధికి ఆటంకమవుతుంది. పెళ్ళికీ చదువుకీ కూడా పెద్ద మొత్తాల్లో ఖర్చు చేయగల స్థితిలో సామాన్య కుటుంబాలుండవు.

ఆర్థిక ప్రపంచీకరణ (Globalisation) వల్ల కొన్ని బహుళ జాతి సంస్థలు ఆధునిక ఉత్పత్తులకు కావాల్సిన మైక్రో చిప్స్ లాంటివి బడుగు దేశాల్లోని స్త్రీలతో చేయిస్తున్నారు. ఎందుకంటే ఈ దేశాల్లో శ్రామికులు చాలా చౌకగా దొరకటమే కాక వాళ్ళు ఓపిగ్గా తయారు చేస్తారు కూడా. ఐతే, ఈ ఆధునిక పరిశ్రమల్లో పని చేసే స్త్రీలకు కొంత అక్షరాస్యత కూడా తప్పనిసరి అవుతుంది. అందుకే విదేశీ సంస్థలు స్త్రీల అక్షరాస్యతా పథకాలను ప్రోత్సహిస్తున్నారు. స్త్రీలు అక్షరాస్యులవటం ఒక రకంగా మంచి పరిణామమే అయినా ఆ విద్య పాలక వర్గాల కవసరమైన పరిధుల్లోనే వుంటుందనేది గమనించాల్సిన అంశం.

ఇక వైద్య రంగంలోనూ ప్రభుత్వ సబ్సిడీలు తగ్గటం, కింది మధ్య తరగతి శ్రామిక వర్గాల ప్రజల ఆరోగ్య స్థితిని మరింత దిగజార్చుతుంది. ఈ ప్రభావం ఆ వర్గాల స్త్రీలపై మరింతగా వుంటుంది. మూడవ ప్రపంచ దేశాల్లోని స్త్రీలలో పోషకాహార లోపంతో వచ్చే వ్యాధులు అధికంగా కన్పిస్తాయి. దీనికి కుటుంబాల ఆర్థిక స్థితి ఒక కారణమైతే, కుటుంబంలో స్త్రీ తనకు తానే ఒక ప్రాధాన్యత లేని వ్యక్తిగా భావించుకోవటం మరో కారణం. స్త్రీలు తీసుకునే ఆహారం గురించి ఇంట్లో ఎవరికీ పెద్ద పట్టింపు వుండదు. గృహిణిగా, తల్లిగా, త్యాగమూర్తిగా స్త్రీని చిత్రించే పరిస్థితి, స్త్రీ తనపై తాను శ్రద్ధ తీసుకోవాలనే స్పృహను పూర్తిగా పోగొడుతుంది. భర్తకూ, పిల్లలకూ పెట్టగా మిగిలిన ఆహారంతో సరిపెట్టుకోవడం సాధారణంగా కన్పించేదే. పైగా పెట్టుబడిదారీ విధానాల వల్ల, ప్రజల్లో పెరుగుతున్న సరుకుల ఆరాధనా, కన్స్యూమరిజం, అధిక ధరలూ- ఈ అవసరాలకై స్త్రీలు బయట కూడా పని చెయ్యాల్సిన స్థితి- యివన్నీ కూడా స్త్రీల ఆరోగ్యాన్ని దెబ్బ తీస్తాయి.

సంతానోత్పత్తి విషయంలో నిర్ణయాధికారం లేకపోవటం కూడా స్త్రీల ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తుంది తన ఆరోగ్య స్థితితోనూ, యితర సౌకర్యాలతోనూ నిమిత్తం లేకుండా సంతానోత్పత్తికీ, గర్భస్రావాలకూ కూడా సిద్ధ పడాల్సి వస్తోంది. దీన్ని ఆధారంగా తీసుకొని వైద్య వ్యవస్థ స్త్రీలను రకరకాలైన ప్రయోగాలకు గురి చేస్తోంది. సామ్రాజ్యవాద దేశాల్లో జరిగే వైద్య ప్రయోగాలన్నీ ముందుగా తమ అధీనంలోని బడుగు దేశాల్లో అమలు జరుగుతాయి. ముఖ్యంగా సంతానో

త్పత్తికీ, గర్భ నియంత్రణం, గర్భస్రావం మొదలైన వాటికి ఉపయోగించే మందులనూ, వైద్య విధానాలనూ ఈ దేశాల్లోని స్త్రీలపై ప్రయోగిస్తారు. ఇవి ఎలాంటి సైడ్ ఎఫెక్ట్స్ కలిగిస్తాయో వైద్యులు చెప్పరు. అసలు వాళ్ళకే సరైన అవగాహన వుండదు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు స్త్రీ పురుష లిద్దరికీ అందుబాటులో వున్నా, సాధారణంగా మగవాళ్ళు వీటికి సిద్ధపడరు. వాటివల్ల తమ శక్తి తగ్గిపోతుందనీ, స్త్రీలు ఇళ్ళల్లో 'విశ్రాంతి'గా వుండేవాళ్ళే కాబట్టి వాటిని భరించాలనీ భావిస్తారు. అసలు సమాజానికీ, వైద్య వ్యవస్థకూ కూడా స్త్రీల శారీరక సమస్యలంటే చిన్నచూపే. ఫైవ్‌స్టార్ హాస్పిటళ్ళలో సేవలు కొనుక్కోలేని స్త్రీలు గవర్నమెంటు ఆసుపత్రులకు వెళ్ళినప్పుడు డాక్టర్లూ, నర్సులూ ఎంత అవమానకరంగా ప్రవర్తిస్తారో చాలా మంది స్త్రీలకు అనుభవమే. వైద్య రంగానికి సబ్సిడీలను తగ్గించి సామ్రాజ్యవాదుల సహకారంతో నిర్మించబడే ఖరీదైన ఆసుపత్రులను ప్రోత్సహించడంతో స్త్రీల ఆరోగ్య స్థితి మరింత దిగజారుతుంది.

ఇలా దేశ ఆర్థిక వ్యవస్థలో సామ్రాజ్యవాదుల ప్రభావం పెరగటం వల్ల స్త్రీలకు విద్య, ఉద్యోగ, ఆరోగ్య రంగాల్లో ఎదురయ్యే సమస్యలు కొంత వరకూ సులభంగానే అర్థమవుతాయి. కానీ, సాంస్కృతిక భావజాలం ద్వారా స్త్రీలను సామ్రాజ్యవాదం దోపిడి చేసే విధానం సంక్లిష్టంగా వుంటుంది. భావజాల వ్యాప్తి ప్రధానంగా ప్రచార సాధనాల ద్వారా జరుగుతుంది. మన దేశంలో రేడియో, కొంత వరకూ టెలివిజన్లూ మాత్రమే ప్రభుత్వ అధీనంలో వుంటాయి. సినిమా, పత్రికలూ ప్రకటనలూ లాంటి వన్నీ ప్రైవేటు వ్యక్తుల ఆధ్వర్యంలో నడుస్తాయి.

రేడియో, దూర దర్శన్‌లు ప్రసారం చేసే నాటకాలూ, ఇతర కార్యక్రమాలూ కూడా స్త్రీ వ్యతిరేక భావజాలాన్ని కళాత్మకత పేర ప్రజల్లో వ్యాపింప చేస్తాయి. దూరదర్శన్ ఎన్నిక చేసే నాటకాల్లోని వస్తువు స్త్రీని ఆదర్శ గృహిణిగా, ఆమె స్థానం కుటుంబంలోనే నన్న విషయాన్ని నొక్కి చెప్పేవిగా వుంటాయి. 'హమ్ లోగ్', 'బునియాద్' లాంటి ఎన్నో పాప్యులర్ సీరియల్స్ యిలాగే నడుస్తాయి. ఇక తెలుగు కార్యక్రమం గురించి చెప్పనే అక్కర్లేదు మహాభారతం, రామాయణం లాంటి పౌరాణిక గాథల్ని భారీ టీ.వీ. ఫిల్ములుగా మార్చడం ఒక ఖచ్చితమైన ప్రణాళికతోనే జరిగింది. వర్గ వ్యవస్థనూ, మతాన్నీ, వర్ణ వ్యవస్థనూ, స్త్రీల పాతివ్రత్యాన్నీ ఆదర్శీకరించే ఈ చిత్రాలు పాలకవర్గ భావ జాలాన్ని ప్రజల్లోకి ఇంజెక్ట్ చేస్తూనే వుంటాయి.

దూరదర్శన్‌కు ప్రత్యామ్నాయంగా ప్రైవేటు వ్యక్తుల ఆధ్వర్యంలోని స్టార్ టీ.వీ., యం.టీ.వీ, జీ.టీ.వీ లాంటివి రంగ ప్రవేశం చేశాక సామ్రాజ్యవాద సంస్కృతి నగ్నంగానే భారత సమాజంలోకి ప్రవేశిస్తోంది. సెన్సార్ చేయబడని

శృంగార చిత్రాలూ, హింసాత్మక చిత్రాలూ, పాప్ మ్యూజిక్, ఫాషన్ షోలూ, బ్యూటీ టిప్స్ లాంటివన్నీ స్త్రీని సెక్స్ సింబల్‌గా చిత్రిస్తుంటాయి.

ఇక సినిమాల విషయంలో—నామమాత్రపు సెన్సార్ బోర్డు పనిచేస్తుందన్న పేరే తప్ప, నిర్మాతల చేతుల్లో వాళ్ళు బానిసలుగానే మిగిలిపోతారనేది అందరికీ తెలిసిన సత్యమే! విపరీతమైన హింసనూ, జుగుప్సాకర శృంగారాన్నీ యధేచ్ఛగా చూపే సినిమాలు ఎలాంటి అడ్డంకులూ లేకుండా నడుస్తూనే వుంటాయి. స్త్రీల పాత్రల సంగతి చూస్తే, స్త్రీ కేవలం మగవాళ్ళ అనుభవిడానికి పని కొచ్చే వస్తువనే సారాంశాన్ని కొత్త కొత్త పద్ధతుల్లో చెప్పడం తప్ప, ఆ పాత్రల్లో ఎలాంటి వైవిధ్యమూ ఉండదు. స్త్రీలను ఏడిపించటం, కొంచెం ఆత్మవిశ్వాసం వున్న స్త్రీ అయితే అత్యాచారాలు చేసి, ఆమె 'పొగరు అణచడం' లాంటివన్నీ హీరో లక్షణాలవుతాయి. ఒక వైపున స్త్రీల బానిసత్వాన్ని మౌలికంగా ప్రశ్నిస్తూ, స్త్రీ విముక్తి ఉద్యమాలు సాగుతుండగా, మరో వైపున స్త్రీల సమస్యలకు తప్పుడు పరిష్కారాలనిచ్చే సినిమాలూ తయారవుతుంటాయి. స్త్రీల మాతృత్వాన్నీ, ఇల్లాలితనాన్నీ ఆదర్శీకరించి ఎంతో సెంటిమెంటల్‌గా చెబుతాయి. బహుభార్యాత్వానికి లెజిటమిసీ కల్పిస్తూ, అలాంటప్పుడు మగవాడిని స్త్రీలు సానుభూతితో అర్థం చేసుకోవాలనీ, అతడిని సుఖపెట్టాలనీ చెప్పే సినిమాల సంఖ్య ఇటీవల చాల ఎక్కువయింది. మరో రకం ఇంకా ప్రమాదకరమైన సినిమాలు శాస్త్ర విజ్ఞానం పేరిటా, స్త్రీల ఆరోగ్య సమస్యల పేరిటా చలామణి అవుతాయి. ఇవి గర్భధారణ, ప్రసవం, సుఖ వ్యాధులు లాంటి అంశాలను తీసుకుని ఆ సాకుతో స్త్రీలను నగ్నంగా ఎక్స్‌పోజ్ చేస్తాయి. ఇవి ఇంగ్లీషు సినిమాల కాపీలుగా వుంటాయి సాధారణంగా.

ఇక వ్యాపార ప్రకటనలు మరింత పకడ్బందీగా స్త్రీలను సామ్రాజ్యవాద కంపెనీల ఉత్పత్తులకు వినియోగదారులుగా మారుస్తాయి. అందుకోసం ఈ ప్రకటనలు స్త్రీ సౌందర్యాన్నీ, మాతృత్వాన్నీ, గృహిణీత్వాన్నీ తమ ప్రచారానికి ముడి సరుకులుగా వాడుకుంటాయి. స్త్రీత్వం గురించి ఆడవాళ్ళ మనసుల్లో స్థిరమైన నమూనాలను నేర్పరుస్తుంది పితృస్వామ్యం. దీని ప్రకారం అందంగా, సున్నితంగా, ఓర్పుగా పిల్లల్నీ, కుటుంబాన్నీ సంరక్షించుకునే మాతృమూర్తిగానూ, మరోక వైపున సమర్థురాలైన ఉద్యోగినిగా, గృహిణిగా కూడా ద్విపాత్రాభినయం చెయ్య గల శక్తిమంతురాలిగా- ఇవన్నీ తనతో వుంటే గానీ మంచి స్త్రీని కాననే భావంతో వుంటారు స్త్రీలు.

ప్రకటనల్లో స్త్రీని ఉపయోగించుకునే ఉత్పత్తులు ప్రధానంగా సౌందర్య సాధనాలూ, బట్టలూ, గృహోపకరణాలూ, పిల్లలకూ భర్తకూ యిచ్చేందుకూ పుష్టికరమైన ఆహారోత్పత్తులూ-ఇలాంటివి సౌందర్య సాధనాలన్నీ కలిసి స్త్రీల సౌంద

ర్యాన్నీ, సినిమా తారల స్థాయిలో రూపొందించేందుకు పోటీలు పడతాయి ప్రకట నల్లు ఇక్కడ మరొక ముఖ్యమైన అంశం -సామ్రాజ్యవాద దేశాల పెట్టుబడులతో తయారయ్యే అనేక సౌందర్య సాధనాలు తమ ప్రత్యేకతను చాటుకునేందుకు, 'భారతీయత' 'పవిత్రత' లాంటి భూస్వామ్య హిందూత్వ భావజాలాన్ని ఆధారంగా చేసుకోవటం - ఫలానా కంపెనీ వారి బొట్టు, కాటుకా 'భారతీయత'లో వున్నా యంటారు. మరో సబ్బు 'పసుపూ-చందనాల' సమ్మేళనంతో పవిత్రమైందంటారు. మరొక కంపెనీ వారు 'పవిత్ర గంగా జలంతో' 'ఆధ్యాత్మిక సబ్బు'ని తయారు చేస్తారు. 'భక్తులకూ, భగవంతునకీ అనుసంధానం' కుదిర్చేందుకు ఒక సంస్థ అయితే అగరు బత్తీలు, మధ్యవర్తులుగా పని చేస్తాయి! వీటన్నిటిలో మోడల్‌గా స్త్రీలే వుంటారనేది ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు సంప్రదాయక అలంకరణలో వున్న పెళ్ళికూతుర్ని చూపుతూ ఆమె ఫలానా వారి చీర కట్టుకున్నదన్న విషయాన్ని ప్రత్యేకంతా ఎక్స్‌పోజ్ చేస్తారు. వీటన్నిటి ద్వారా సామ్రాజ్యవాదుల పెట్టుబడికీ, మన దేశంలోని భూస్వామ్య భావజాలానికీ ఎంత బాగా ఐక్యత కుదురుతుందో ఆ రెంటి సమ్మేళనం పితృస్వామ్య భావజాలాన్ని ఎంత బలంగా గ్లామరస్‌గా స్త్రీలపై ప్రయోగిస్తోందో స్పష్టంగా అర్థమవుతుంది,

ఇక బట్టల సబ్బులూ, వంట పాత్రలూ, గ్రైండర్లూ ఇతర గృహోపకర ణాలూ వీటన్నిటి ప్రకటనలూ స్త్రీలను సరుకుల వ్యామోహంలోకి నెడతాయి. ఇవి స్త్రీ ప్రపంచమంతా కుటుంబంతోనే పరిమిత మవుతుందనే భావాన్ని చెప్పటమేకాక, ఆమె శ్రమ తాలూకు నైపుణ్యాన్నంతా ఆ పరికరాలకు ఆపాదిస్తాయి కూడా. ఒక స్త్రీ మంచి వంట తయారు చేయగలగటానికి కారణం ఫలానా కుక్కరో, గ్రైండరో, పెనమో అవుతుంది. ఆమె శుభ్రంగా బట్ట లుతకడాని క్కారణం 'ఓనిడా' వారి వాషింగ్ మెషీన్ అవటమే కాక, ఆ మెషీన్ ఉతకడంతో 'స్త్రీ విముక్తి' అయి పోతుంది కూడాను. వీటన్నిటిలోనూ స్త్రీ పడే శ్రమ ప్రసక్తి ఎక్కడా కన్పించదు. అంటే ఆమె తన శ్రమ ఫలితం నుంచి తాను పరాయీకరించ బడతోందన్నమాట. కానీ, ఆ విషయం మన కెక్కడా అర్థం కాకుండా దీన్నంతా 'అభివృద్ధి' పేర చలా మణీ చేస్తుంది పెట్టుబడిదారీ ప్రపంచం.

సైన్స్. టెక్నాలజీ రంగాలకు సంబంధించి నంత వరకు యిది అభివృద్ధి ఐతే, ఆ అభివృద్ధి ఎవరి లాభాల కోసం జరుగుతోంది. ఏ వర్గాల ప్రయోజనాలను తీరుస్తోంది అనేదే ప్రశ్న. స్త్రీల కోసమూ, వాళ్ళ సౌకర్యం కోసమూ సృష్టించ బడ్డాయని చెప్పబడుతున్న ఈ ఆధునిక సౌకర్యాలు దేశంలోని ఎంత శాతం స్త్రీలకు అందుబాటులో వున్నాయనేదొక ప్రశ్నయితే, వాటిని పొందగలిగిన స్త్రీల వంటపనీ, ఇంటి పనీ వాళ్ళకి సంబంధించిందిగా ఎందుకుండాలనేది మరో ప్రశ్న. ఇంటి పని

స్త్రీకి సంబంధించినదే నన్న భావజాలం వెనక వున్న ప్రాపంచిక దృక్పథాన్ని మార్చగలిగే శక్తిలేని 'అభివృద్ధి పథకాలు' నిజమైన అభివృద్ధి నివ్వలేవు. ప్రజల సంక్షేమానికి పనికి రావు.

ప్రజా వ్యతిరేక వ్యక్తుల చేతిలో సైన్స్, టెక్నాలజీ వంటి ఆధునిక విజ్ఞానం కూడా వికృతమైన ఫలితాల నిస్తుందని చెప్పటానికి కంప్యూటర్ జోస్యాలూ, అమ్నియో సెంటిసిస్‌లా మంచి ఉదాహరణలు. ఇలాంటి సందర్భాల్లో ఆడవాళ్ళను మూర్ఖులనీ, హృదయం లేని వాళ్ళనీ నిందిస్తుంది సమాజం. ఆడ పిల్ల పుట్టుకనే వద్దనుకునే స్థితికి స్త్రీలను నెట్టేంతగా మానవ సంబంధాలు వ్యాపారీకరణ జరగటం పైకి కన్పించదు.

స్త్రీలకూ పర్యావరణ సమస్యలకూ వున్న సంబంధాన్ని అర్థం చేసుకోవా లన్నా, మూడవ ప్రపంచ దేశాల పర్యావరణ సమస్యల్లో అభివృద్ధి పథకాల పాత్రను గురించి తప్పకుండా పరిశీలించాలి. ఆధునిక పరిశ్రమలు పెరగటం వల్లా, అవి ప్రైవేటు వ్యక్తుల చేతుల్లో వుండిపోయి, కాలుష్య నివారణకు సంబంధించిన చట్టాలు అమలు కాకపోవటం వల్ల వాతావరణ కాలుష్యం విపరీతంగా పెరుగుతోంది. వాహ నాల నుంచి వెలువడే కాలుష్యమూ, శబ్ద కాలుష్యమూ, నగరాలను కాలుష్య కేంద్రా లుగా చేస్తున్నాయి. పరిశ్రమలన్నిటినీ నగరాల్లో కేంద్రీకరించటం వల్ల కూడా ఈ కాలుష్యం విపరీతంగా పెరిగిపోతోంది. అడవులపై ప్రైవేటు కాంట్రాక్టర్లకూ, పెట్టుబడిదారులకూ అధికారాలివ్వటమూ, ఎగుమతులకు పని కొచ్చే వివిధ ఉత్పత్తుల కోసం విచక్షణా రహితంగా అడవులను నరకటంలో వరదలూ, కరువులూ సర్వ సాధారణ మయ్యాయి. సామ్రాజ్యవాదుల పరిశ్రమలకు పనికొచ్చే యూకలిప్టస్ చెట్లను విపరీతంగా పెంచడం భూసారాన్ని హరించి, భూగర్భ జలాలు అంతరించి పోతున్నాయి. మొత్తం మీద ఈ కాలుష్యం మానవాళిని భయంకరమైన సమస్య ల్లోకీ, వ్యాధుల్లోకీ నెడుతోంది. ఆమ్ల వర్షాలూ, ఓజోన్ పొర హరించి పోవటం వల్ల వచ్చే దారుణమైన జబ్బులూ పెరుగుతున్నాయి ఈ పరిణామాలన్నీ అభివృద్ధి పథకాల పేర జరుగుతున్న సామ్రాజ్యవాద అనుకూల విధానాల ఫలితాలే. వర్గాలకూ వర్గ దోపిడికి అతీతంగా అభివృద్ధి అనేది వుంటుందనుకోవటం నిజం కాదు. పాలక వర్గాలు అభివృద్ధికి సంబంధించిన యాంత్రికమైన లెక్కలు చూపుతాయేగాని, వాటి వల్ల నష్టపోతున్న, నిర్వాసితులౌతున్న ప్రజల గురించి చెప్పను. ఈ కాలుష్య నివారణ పేరిట కూడా సామ్రాజ్యవాదులు బడుగు దేశాలనే నష్ట పరిచే కార్య క్రమాలు తీసుకుంటారు. ఉదాహరణకు 1992లో రియోలో ఎర్త్ సమ్మిట్ జరిగి నప్పుడు ఈ కాలుష్య వాయువుల నివారణకు అమెరికా ఒక మార్గం సూచించింది. అదేమంటే ప్రపంచం మొత్తం మీద వున్న అడవులన్నీ ప్రపంచ సంపదగా పరిగ

టించి, దాని కొరక అంతర్జాతీయ సంస్థను ఏర్పాటు చేయాలనీ, ప్రపంచంలోని కాలుష్యాన్నంతటినీ గ్రహించేందుకు ఆ అడవుల్లో ఏర్పాట్లు చేయాలనీ, అసలు ప్రపంచ మంతట్లోని పరిశ్రమల నుంచీ విడుదలయ్యే కార్బన్ డై ఆక్సైడ్‌లో నాల్గవ వంతు అమెరికాయే విడుదల చేస్తుంది. అడవులేమో మూడవ ప్రపంచ దేశాల్లో అధికంగా వున్నాయి. అంటే సామ్రాజ్యవాదుల అభివృద్ధి పథకాలనూ, వాళ్ళ పరిశ్రమల కాలుష్యాలనూ కూడా ఈ దేశాల ప్రజల మీదే రుద్దుతారన్న మాట.

ఈ పర్యావరణ సమస్యలు మానవుల ఆరోగ్యం మీదా, వాళ్ళకు నిలువ నీడ లేకుండా చేసే కరువులూ, వరదలుగానూ కూడా శ్రామికులకు భయంకర సమస్య లవుతున్నాయి. ఇవి కుటుంబ పరంగానూ, ఆరోగ్య పరంగానూ కూడా స్త్రీలను మరింత వేధించే సమస్యలవుతాయి. అడవుల నరికివేత వల్ల గ్రామీణ స్త్రీలకు వంట చెరకూ, నీరూ కూడా దొరక్కుండా పోతాయి. ఆహార, వైద్య సదుపాయాల విషయంలో మామూలుగానే నిర్లక్ష్యానికి గురయ్యే స్త్రీలు ఈ పరిణామాలను నిస్స హాయంగా భరించాల్సి వుంటుంది.

దేశంలోని చాలా ప్రాంతాల్లో స్త్రీలు ఈ పర్యావరణ సమస్యపై తీవ్రంగా స్పందించి ఉద్యమాలు నడుపుతున్నారు. చిప్కో ఉద్యమం అలాంటి వాటిలో ఒకటి. కొన్ని సందర్భాల్లో మగవాళ్ళు వ్యతిరేకించినా గ్రామీణ స్త్రీలు ఐక్యంగా, ఎంతో సాహసంతో అటవీ శాఖనూ, కంట్రాక్టర్లనూ ఎదిరించి, అడవుల నరకివేతను ఆపేసారు- పర్యావరణ ఉద్యమాల్లో స్త్రీల పాత్రను సిద్ధాంతీకరించి, విశ్లేషించారు Eco- Feminist లు.

'Staying Alive' అనే పుస్తకంలో వందనా శివ భారత పర్యావరణ ఉద్యమాల్లో స్త్రీల పాత్రనూ, పర్యావరణానికీ, స్త్రీలకూ వుండే ఐక్యతనూ, స్త్రీవాద దృక్పథంతో చర్చించారు. పర్యావరణ సమస్యలు స్త్రీలకు అదనపు సమస్యలుగా మారుతున్న క్రమాన్ని ఆమె అద్భుతంగా విశ్లేషించారు. ఐతే వందనా శివ చేసిన కొన్ని రకాల విశ్లేషణలు వివాదాస్పదంగా వుంటాయి.

ఉదాహరణకు- స్త్రీకీ, ప్రకృతికీ సహజమైన పోలికా, సంబంధం వుంటాయి. మానవాళికి ఆధారాన్ని కల్పించటం, ప్రత్యుత్పత్తీ అనేవి ఆ పోలికల్లో ముఖ్య మైనవి. చరిత్రలో మొదట వ్యవసాయాన్ని కనిపెట్టింది స్త్రీలే. అందువల్ల ప్రకృతినీ పర్యావరణాన్నీ స్త్రీలు అర్థం చేసుకున్నట్లుగా పురుషులు అర్థం చేసుకోలేరు. అందుకే పురుషులు 'హరిత విప్లవం' పేరు ఇతర అభివృద్ధి పథకాల పేరా పర్యావరణ విధ్వంసానికీ దిగుతున్నారు. స్త్రీలే వాటిని రక్షించుకునేందుకు ఉద్యమిస్తున్నారు.

పురుషులు స్త్రీ మీద చేసే దౌర్జన్యాలూ, ప్రకృతిపై జరిగే విధ్వంసమూ, పరస్పర ప్రభావంలో వుంటున్నాయంటూ హరిత విప్లవానికి నాంది పలికిన

హర్యానా, పంజాబ్‌లలోనే స్త్రీలపై అత్యాచారాలు కూడా అధికంగా జరిగాయనీ, దేశంలో అమ్నియో సెంటిసిస్ క్లినిక్ అమృతసర్‌లో మొదలయిందనీ కూడా వందనా శివ సిద్ధాంతీకరించారు.

ఐతే ఈ పర్యావరణ వినాశనానికి కారణమైన అభివృద్ధి పథకాలకు మూలం ఎక్కడుందో ఆమె రచనలో కన్పించదు. పైగా శాస్త్రవిజ్ఞానమే సంకుచితమైందంటూ నిందిస్తుంది కూడా. శాస్త్రజ్ఞానం ఉపయోగించుకోబడుతున్న విధానాలు సంకుచితమైనవనీ, వాటి వెనక సామ్రాజ్యవాదుల వత్తిడీ, దేశీయ దళారీ బూర్జువాల లాభాపేక్ష కొంత వున్నాయనీ అర్థం చేసుకోకపోతే, చివరికి పర్యావరణ సమస్యను గురించిన విశ్లేషణలు అస్పష్టతకు దారి తీస్తాయి. వందనా శివ రచనలో జరిగిందీ అదే. పైగా స్త్రీనీ, ప్రకృతినీ పురుషుడి అధికారంలో వుంచడమనేది ఒక అనివార్యమైన విషయంగా భావించటంతో, స్త్రీ పురుషుల మధ్య అసమానతలే ప్రకృతి సహజమైనవనే భావనకు దారితీసి, ఇక పోరాటం ఎవరితోనో అర్థం కాకుండా పోతుంది.

పర్యావరణానికీ, స్త్రీలకూ మధ్యవున్న సంబంధాన్ని అర్థంచేసుకోవాలంటే, పర్యావరణ వినాశనానికీ, సామ్రాజ్యవాద ప్రయోజనాలతోసాగే అభివృద్ధి పథకాలకూ వున్న సంబంధాన్ని ముందుగా స్పష్టంగా అర్థం చేసుకోవాలి. అలాగే సామ్రాజ్యవాద ఆర్థిక విధానమూ, సంస్కృతీ స్త్రీలను ఏ సమస్యలకు గురిచేస్తున్నాయో తెలుసుకోవాలన్నా ఈ దేశపు సామాజిక స్వభావాన్ని అర్థం చేసుకుని, అదనంగా స్త్రీలపై వుండే పితృస్వామ్య అణచివేతలను కలిపిచూడాలి. అంటే ఈ దేశంలోని భూస్వామ్య, సామ్రాజ్యవాద విధానాలను ఎదిరించే అవగాహన కల ప్రజా పోరాటాలే ఈ సమస్యను పరిష్కరించగలవు. ఆ అవగాహన కలిగిన స్త్రీ విముక్తి ఉద్యమాలే సామ్రాజ్యవాదం స్త్రీలకు కల్పించే అదనపు సమస్యలను అర్థంచేసుకునే స్పష్టతను పొందగలవు. ఐతే స్త్రీలపై పితృస్వామ్య ప్రభావాన్నీ, జెండర్, సెక్సువాలిటీ లాంటి ఎన్నో అంశాలనూ సమర్థవంతంగా విశ్లేషించిన స్త్రీవాద సిద్ధాంతం ఈ స్త్రీ విముక్తి ఉద్యమాలకు మరింత స్పష్టత నివ్వగలదు.

పెరుగుతున్న ప్రజా పోరాటాలను ఎదుర్కొనేందుకు సామ్రాజ్యవాద సంస్కృతి ఇంకా ఆకర్షణీయమైన విధానాలతో ముందుకొస్తుంది. ఆ దేశాలు కొత్త అభివృద్ధి పథకాల పేరిట మనల్ని మభ్యపెట్టేందుకూ సిద్ధపడతాయి. అవి స్త్రీలను మరింత దుర్భరమైన బానిసత్వంలోకి నెడతాయి. వీటన్నిటితోనూ పోరాడగలిగే బలమైన, స్త్రీ విముక్తి ఉద్యమాన్ని నిర్మించుకోవాల్సిన కర్తవ్యం మనముందుంది.

# మా గుడిసె

— తైదల అంజయ్య

మా గుడిసె కాలి నపుడు
ఇంట్ల పీను గెల్లినంత బాధయింది.
ఎన్ని జ్ఞాపకాలు మంటగలిసాయనీ/రేపటి కలల కోసం నేను
అగ్గి పెట్టెలో పావలా బిళ్ళలు
దాచుకున్నది అ గుడిసెలోనే./జాతరలో కొనుక్కున్న
పిల్లన గొయ్యను వూదుకుంటూ
నే నాడుకున్నది అ గుడిసెలోనే.
పండుగలకే తొడుక్కునే 'నా బొమ్మల అంగి'
కాలిపోయిందీ అ గుడిసె లోనే

మా గుడిసె కాలినపుడు మా అవ్వకు
కడుపు కాలినంత దుఃఖం
చెట్టంత కొడుకు చెట్లల్లో కలిసిపోయాడని
ఉన్నోళ్ళ మీద ఏడవలేక
పోయినోళ్ళను తలుచుకుని ఏడ్చింది.
మా గుడిసె కాలినపుడు మా అయ్యకు
తోడేలు మేకపిల్ల నెత్తుక పోయినంత బాధ
గుట్టల్లో గుర్తు తెలియని శవం
కనిపించినంత దుఃఖం/మా గుడిసె కాలినపుడే

అన్నీ కాలిపోయాయి.
పావలాలు దాచుకున్న అగ్గిపెట్టె
జాతరలో కొనుకున్న పిల్లనగొయ్యా,
పండుగలకు తొడుక్కునే బొమ్మల అంగి
ఇవన్నీ కాలిపోయి
ఇంకా నన్ను వెంటాడుతూనే వుంటాయి
కలమూ, కాగితాలనే మిగుల్చుకున్నవాన్ని.
ఇపుడు నేనేం కావాలి?/గుడిసె కాలుతుంటే
చుట్ట కాల్చుకునే వాళ్ళ కోసం
నా కళ్ళల్లో గుడిసె కాలిన మంటలుగా
అక్షర జ్వాలలను
వెలిగించుకోవడం తప్ప.

# హృదయాన్ని కదిలించే కార్మిక కథల సంపుటి- "బోనస్"

—బి.యస్. రాములు



జీవితానికి సమాజానికి మధ్య ఐదారు ప్రధానమైన సంబంధాలున్నాయి. 1) జీవితానికి సమాజానికి మధ్యగల సంబంధం. 2) జీవితానికి స్త్రీ పురుషులకు మధ్యగల సంబంధం. 3) జీవితానికి కుటుంబానికి మధ్యగల సంబంధం. 4) జీవితానికి కులానికి మధ్యగల సంబంధం. 5) జీవితానికి జాతి మత ప్రాంత దేశాలకు మధ్యగల సంబంధం. 6) జీవితానికి ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సాధనాలకు,ఉత్పత్తి సంబంధాలకు మధ్యగల సంబంధం. జీవితానికి వర్గానికి గల సంబంధం.

'బోనస్'లోగల ఆరు కథలు జీవితానికి సమాజానికి మధ్యగల సంబంధాల్ని చిత్రించాయి. దాంతోపాటు ఆధిపత్యంలో వున్నవాడికి జీవితానికి మధ్యగల సంబంధాలను, అవి రూపొందుతున్న తీరు తెన్నులను ఈ కథలు మన ముందుంచుతాయి.

"లా అండ్ ఆర్డర్" కథలో మన రక్షణ చూడ్డంకోసం అంటూ అప్పగించిన అధికారం పోలీసుల చేతుల్లో ఎంత దుర్వినియోగమవుతుందో తెలుపుతుంది. ప్రజల్లోని అజ్ఞానం, నిరక్షరాస్యతే పెట్టుబడిగా ఒకడు మధ్యవర్తిగా మునిగి భూస్వామిగా తేలే క్రమాన్ని "ఉచ్చు" కథ వివరిస్తుంది. అధికారం, కులాధిక్యత, మందిని ముంచే తెలివి కలిసి పల్లెలో 'దొర'ను సృష్టిస్తున్నాయి. ఉద్యమ దృక్పథానికి నిన్న మొన్నటిదాకా ఈ స్పష్టత లేనందున ఈ కథలో కులాధిక్యత యొక్క కావతాన్ని చిత్రించడం జరుగలేదు.

హైదరాబాద్ పరిసర ప్రాంతాల్లో విస్తరిస్తున్న పరిశ్రమలు, అవి పేద కార్మికుల్ని ఎలా దగా చేస్తున్నాయో ఈ కథలు వివరిస్తాయి. అన్ని కథల్లోనూ దోపిడి ఎంత ఘోరంగా సాగుతుందో స్పష్టం చేస్తారు రచయిత. ఫ్యాక్టరీల్లో ప్రమాదాల్లో చిక్కుకున్నవారి గురించి యజమాన్యం ఎంత కర్కశంగా వుంటుందో

ఈ కథల్లో చదివి చలించిపోతాము. కార్మిక నాయకుడిని ప్రమాదం పేరిట ఎట్లా మట్టుబెడతారో 'బోనస్' కథ తెలుపుతుంది.

ఈ కథలు కార్మిక కథలు. బాల కార్మికులు, వృద్ధ కార్మికుల్తో సహా ఎన్ని అవస్థలు పడుతుంటారో యిందులో స్పష్టం చేస్తారు. రచయిత స్వయంగా అనుభవించిన బాలకార్మికుడి జీవితం- అనుభవాలు ఈ కథల రచనలో ఎంతో ఉపయోగపడ్డాయి. మరో ముఖ్యాంశం ఏమంటే తన యిరవయవ ఏటనే గోర్కీ స్థాయిలో కార్మిక కథలు రాయడం- సృజన, నూతన, ప్రజాసాహితి వంటి పత్రికలు ప్రచురించడం, 1960లో పుట్టి, 1980 నాటికే 19, 20 ఏళ్ళ వయస్సులో పేదల పక్షం నిలబడి సమాజాన్ని, జీవితాన్ని అధ్యయనంచేసి హృదయాల్ని కదిలించే యింత చక్కని కథలు రాయడం ఎంతో గొప్ప విషయం. బోనస్ కథను నేను తొలిసారి సృజనలో 1980లో చదివినపు డిచ్చిన అనుభవం యిప్పటికీ సజీవంగా వుంది.

అయితే 1994 నాటికి ఈ 14 ఏళ్ళల్లో ఎంతో గొప్ప కథకుడుగా ఎదగాల్సిన పులుగు శ్రీనివాస్ జీవితం విసిరిన వలలోపడి చిక్కుకున్నది. అందువల్ల దాశరథి రంగాచార్య ముందుమాటలో చెప్పిన అంశాల్ని గుర్తుచేయడం అవసరం. "మనిషి పోరాటంలోంచి పుట్టాడు. పోరాటంలో జీవిస్తున్నాడు. పోరాటం చేస్తూనే అస్తమిస్తాడు. పోరాటంలేని జీవితంలేదు. జీవితంలేని పోరాటంలేదు. రచయితగా శ్రీనివాస్ పోరాటం నేర్చుకోవాలి. కనీసం అతని పాత్రలు తిరగబడాలి. గెలవాలి. మనిషి గెలుపు అనే ఆశతో జీవిస్తాడు."

ఇక బతకడని అతని కథల పుస్తకం తేవాలని మిత్రులు చేసిన ప్రయత్నం యిది. డాక్టర్లు శ్రీనివాస్‌ను బతికించారు. మనకిపుడు కథల పుస్తకమూ, రచయితా దక్కారు. ఇంత గొప్ప కలం గల పులుగు శ్రీనివాస్ ఉదయం డేలీ హైద్రాబాద్ చీఫ్ రిపోర్టర్ పనితో సరిపుచ్చుకోకుండా మరిన్ని మంచి రచనలు అందించాల్సిన బాధ్యత కూడా వుంది.

చక్కని ఈ కథల పుస్తకాన్ని అందరు తప్పక చదవాలి.

[బోనస్-ఆరు కార్మిక కథలు, ప్రథమ ముద్రణ ఫిబ్రవరి 94, వెల : 20 రూ॥లు. ప్రతులకు గ్లోబల్ హ్యూమనిస్టు సొసైటీ, 48-200, గణేశ్‌నగర్, HMT పోస్టు. హైదరాబాద్-500854. మరియు నవయుగ సుల్తాన్ బజార్, హైదరాబాద్]

## నాకెందుకు

—గూడ అంజయ్య

నీ వేదాంతం నాకెందుకు?
సిద్ధాంతము కావాలి.
నీ అర్చనలు నా కెందుకు?
ఆచరణ కావాలి.
నీ విహార యాత్రలు నాకెందుకు?
అహర్నిశలూ అన్వేషణ కావాలి.
నీ ఊకదంపుడు ఉపన్యాసలెందుకు?
అభాగ్యుల ఆర్తనాదాలు కావాలి.
నీ పిల్ల వాయువులు నాకెందుకు?
తల్లి పాలు లేని పిల్లల గోడు కావాలి.
నీ ఏడంతస్తుల మేడెందుకు?
మాకు నిలువ నీడ కావాలి.
నీ మధుర పానీయాలు నాకెందుకు?
గొంతు తడుపుకోవడానికి గుక్కెడు నీళ్ళు కావాలి.
నీ పంచభక్ష పరమాన్నాలు నాకెందుకు?
ప్రజలకు పట్టెడన్నము కావాలి.

(రచనా కాలం : 1987)

## స్వీకారం :

1) మహిళా జన జీవన సమస్యలు. మూలాల అన్వేషణ (వ్యాస సంకలనం) —కాత్యాయనీ విద్మహే, జ్యోతీరాణి, శోభ, ప్రచురణ : స్త్రీ జనాభ్యుదయ అధ్యయన సంస్థ - వరంగల్లు, పేజీలు : 192, వెల 40/- సోల్ డిస్ట్రిబ్యూటర్స్, నవోదయ బుక్ హౌజ్, హైదరాబాద్.

2) గుడిలో సెక్స్ (వ్యాస సంకలనం) డా॥ ఆరుద్ర, పేజీలు : 126, వెల : రు. 30/- ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001 యితర బ్రాంచీలల్లో కూడా.

3) అంబేద్కరిజం - సోషలిజం (వ్యాస సంకలనం) — బి.ఎస్. రాములు, పేజీలు : 70, వెల : రు. 12/- ప్రచురణలు : విశాల సాహిత్య అకాడమి ప్రచురణ; జగిత్యాల ప్రతులకు : మైత్రి బుక్ హౌస్, విజయవాడ.

4) దళిత భారతి (కవితా సంకలనం) అకుల గంగాధర్, పేజీలు : 34 వెల : రు. 10/-, ప్రచురణ : విశాల సాహిత్య అకాడమీ ప్రచురణ, ప్రతులకు : మైత్రి బుక్‌హౌస్, విజయవాడ.

5) మన చలం (సమీక్ష వ్యాస సంకలనం), సంపాదకత్వం : కృష్ణాబాయి పేజీలు 164, వెల రు. 25/-, ప్రచురణలు : పెర్‌స్పెక్టివ్స్, హైద్రాబాద్ ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, హైదరాబాద్.

6) కవి చలం (కవితలతో ఫోటో ఆల్బం) కూర్పు : వజీర్ రహ్మాన్, ఎడిటర్ : చలసాని ప్రసాదరావు, పేజీలు 80, వెల రు. 5/-, పచురణ : గుడిపాటి వెంకటచలం శతజయంతి సంఘం. 2- అన్నపూర్ణ అపార్ట్‌మెంట్స్, చైతన్యపురి, హైదరాబాద్-500 036.

7) సాహు ఇంటర్వ్యూలు —బి.ఎస్. రాములు, అవునూరి సమ్మయ్య పేజీలు 52, వెల రు. 10/- ప్రచురణ : విశాల సాహిత్య అకాడమీ, జగిత్యాల ప్రతులకు : మైత్రి బుక్‌హౌస్, విజయవాడ.

8) ఒక దెయ్యం ఆత్మకథ - గోపాత్రుడు - వీరబొబ్బిలి (మూడు నవలికలు) కె.యన్.వై. పతంజలి, పేజీలు 224, వెల : రు. 35/- ప్రచురణ, ప్రతులకు : న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, కారల్‌మార్క్స్‌రోడ్డు, విజయవాడ-2.

9) ఈ కన్నీటికి తడిలేదు (కవితా సంకలనం) రాధేయ, ప్రచురణ : పేజీలు 64, వెల రు. 12/- ప్రతులకు శ్రీమతి వి. సత్యాదేవి, ఇంటి నెం. 1-642, పోతులయ్యపాలెం వీధి, అర్.టి.సి. బస్‌స్టాండ్ దారి, తాడిపత్రి-515 411.

10) అంధా ఫెమినిస్టులారా! - మీ ప్రయాణం పూర్తయిందా!-ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) నెల్లూరుజిల్లా శాఖ. పేజీలు 28, వెల : రూ. 3-00 కాపీలకు : మనో బుక్ స్టాల్, సండే మార్కెట్, నెల్లూరు-524001.

11) కథ 93 (ఉత్తమ కథల సంకలనం) సంపాదకులు : వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్. ప్రచురణ : కథా సాహితి సికిందరాబాద్, పేజీలు 164. వెల రు. 25/-, ప్రతులకు : మైత్రి బుక్‌హౌస్. విజయవాడ.




నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd.,
25-1-1- ఫతేబాద్, ఏలూరు - 534002

పిల్లలూ-

ఈ నెల 'కృష్ణ' అనే ఓ చిన్న రచయిత తన బాల్యం గురించి వివరించాడు అలాంటి వారు మన దేశంలో కోట్లాది మంది ఉన్నారు. ఇంకా నరకాన్ని అనుభవిస్తున్న వారూ ఉన్నారు. మనం కొత్త విషయాలు తెలుసుకోవాలి. చందమామ, వెన్నెల, చెట్లూ, సెలయేర్లూ, ఇంకా ఆటలూ, పాటలూ ఇవన్నీ ఎంతో ఆనందం కలిగిస్తాయి. వాటితో పాటు ఇదిగో ఇలాంటి జీవితం ఉంది. ఈ దేశంలో పేదరికం ఉంది. చదువుకోలేని పిల్లలున్నారు. వారి ఆకలి ఉంది. అంటే ఈ ప్రపంచం ఎంత గొప్పదో- అంత అన్యాయమైంది కూడా. అందుకే ఈ అన్యాయం పోవాలి అని ఎందరెందరో తమ జీవితాలను అంకితం చేసుకుంటున్నారు. అలాంటి గొప్ప వ్యక్తుల గురించి తెలుసుకోవాలి.

'మే' సంచికలో 'చలం' తాతగారి గురించి మనం ముచ్చటించుకున్నాం. నెల్లూరు నుండి హజరత్ అలీగారు "బిడ్డల శిక్షణ" తిరిగి చదివినట్లయింది. మీకు అభినందనలు అని రాశారు.

ఇంక 'శ్రేయస్' శెలవుల్లో 'తిరుపతి' వెళ్ళాడంట. తన అనుభవం గురించి "ఘాట్ రోడ్‌లో బస్సు ఓవర్ టేక్ చేసింది. నాకు చాలా భయం కలిగింది" అని రాశాడు. మామూలుగా రోడ్లమీద ఈ ఓవర్ టేక్‌లు చేయటం వలన చాలా ప్రమాదాలు జరుగుతుంటాయి. మా 'ఏలూరు'లోనే ఎందరో పిల్లలు ఈ దుర్మార్గానికి బలయ్యారు.

'తిరుపతి' రోడ్లు ఎంత ఇరుకుగా ఉంటాయో అందరికీ తెలుసు. అంత ఎత్తు మీద ప్రయాణం చేసే బస్సులు ఓవర్ టేక్ చేయటం క్షమించరాని నేరం ఈ బాధ్యతా రాహిత్యాన్ని 'పిల్లల ప్రపంచం' ఖండిస్తోంది. ఇలా ప్రజల ప్రాణాలతో ఆడుకోవటం ఇకనైనా

మానుకోవాలని అలాంటి వ్యక్తులను హెచ్చరిస్తోంది. పిల్లలూ- ఇలాంటి అన్యాయాల గురించి రాసి పంపించండి. అందరి దృష్టికి తీసుకువద్దాం.

మీ

—మావయ్య

# నా బాల్యం ఓ నరకం

ప్రతి మనిషికీ బాల్యం ఓ మరపు రాని మధురానుభూతి.

స్నేహితులతో ఆటలు, గిల్లికజ్జాలు ఎంత ఆనందమో. ఎంత ఉత్సాహమో, కానీ నాకు బాల్యం ఓ నరకం. భయాం కరం.

విశాఖ జిల్లాలో 'నగరప్పాలెం' అనే పల్లె మా ఊరు. ఓ రెండు వందల ఇళ్ళుంటాయి. ఏవో కొన్ని కుటుంబాల్లో తప్ప, మిగతా అన్ని కుటుంబాల్లో ఆకలీ, దారిద్ర్యం ఎక్కువ. ఇంటి బాధ్యతలు పట్టించుకోవలసిన మా నాన్న లాంటి వారు 'సారా'కు బానిస కావటం అందుకు కారణం. ఇంక మా తల్లులు అక్షర జ్ఞానం లేనివారు. అమాయకులు. సారా మత్తులో భర్తలు కొట్టే దెబ్బలను మౌనంగా భరించి, ఓ రకమైన జీవితా నికి అలవాటు పడినవారు. అలాంటి వాతావరణంలో పెరిగిన బాలల్లో నేనూ ఒకడ్ని.

నాన్న అమ్మ జుత్తు పట్టుకొని కొడు తుంటే బిక్క మొహం వేసుకొని చూడటం మినహా ఏమీ చేయలేకపోయే వాడిని. అమ్మను ఆ దెబ్బల నుండి కాపా డాలని ఉండేది. నాన్నను ఎదిరించాలని ఉండేది. నాన్న కొట్టిన దెబ్బలకు అమ్మ ఏడుస్తుంటే ఓదార్చాలని ఉండేది. ఆ చిన్ని వయసు, ఆ చిన్ని హృదయం నాకు సహకరించేవి కాదు. కొద్దిపాటి పొలం తాగుడికి హరించుకు పోయింది. నా కంటే ముందు ఈ ప్రపంచంలోకి వచ్చిన ఇద్దరక్కల పెళ్ళిళ్ళు చేయాలి. మరి నేను చదువుకోవాలి. నాన్నకెవరో సలహా ఇచ్చారు. బెజవాడ వెళ్ళి బతకండి. ఆ నగరం మీలాంటి వారిని ఆదరిస్తుందని. ఇల్లు బేరం పెట్టాడు. వచ్చిన డబ్బుతో పెళ్ళి కెదిగిన అక్క లతో మూటా, ముల్లె సర్దుకొని కాందిశీకుల్లా బెజవాడ వచ్చేశాం. పుట్టిన ఊరూ, బాల్య మిత్రులూ అన్నింటినీ మించి నేను అమితంగా ప్రేమించే గోస్తనీ నది నాకు దూరమయిపోయింది.

ఏం తిన్నామో, రోజులు ఎలా గడిచాయో అదో చరిత్ర. నాకు మా ఊరే నయం అనిపించింది. ఏ కల్మశం లేని మా వూరి జనం పదే పదే గుర్తుకు వచ్చేవారు. నాన్నది ఇక్కడా అదే తంతు. మా ఊర్లో అయితే అమ్మను కొడుతుంటే ఇరుగు పొరుగు వారు వచ్చి ఆపేవారు. కానీ ఈ నగరంలో, నాగరకులమని చెప్పుకునేవారు ఈ గొడవ మనకు చెందింది కాదని తలుపులు బిగాయించుకునే వారు. పల్లెకూ, నగరానికీ తేడా నా బాల్యంలోనే తెలుసుకున్నాను.

అక్కలిద్దరూ బిళ్ళల కంపెనీలో పని చేసేవారు. అమ్మ చుట్టలు చుట్టేది. నేను బాల కార్మికుడిగా మారవలసి వచ్చింది. '9' అంకెతో నా చదువు ఆగిపోయింది. నగర జీవితం కొత్త. స్నేహితులు లేరు. ఆటలు లేవు. బాల్యంలో ఉత్సాహం పోయి నిస్సారంగా రోజులు వెళ్ళదీసు వలసి వచ్చేది. అప్పుడే టైలరింగ్ నేర్చుకోవటం మొదలుపెట్టాను. దాంతో పాటు పుస్తకాల మీదకు దృష్టి మారింది అవే నా నేస్తాలు. వాటిని సేకరించి మంచి పాఠకుడిగా మారాను. అప్పుడే ఏమైనా రాయాలనే ఆలోచన కలిగింది. నేను రచయితగా ఇదంతా రాయటం లేదు. నేను ఇప్పుడే ఆ రంగంలోకి వస్తున్నాను.

జీవితంలో ఈపాటి భద్రత ఏర్పరుచుకోవటం వెనక ఉన్న పరిస్థితుల గురించి చెప్పటం ఇది. నాలాంటి పిల్లలు ఎందరెందరో. పెద్దల నిర్లక్ష్యానికి, దురలవాట్లకు వారి బాల్యాన్ని అర్పిస్తున్నారు. అలాంటి తండ్రులు మారాలి. బహుశా నేను 'రచయిత' కావాలనుకోవటం వెనక ఈ బీభత్సమే ఉందని నా కనిపిస్తోంది.

— అరసవిల్లి కృష్ణ, విజయవాడ

కథ :

# అన్నమే కావాలి!

## — పుప్పాల కృష్ణమూర్తి

సుదేశ రాజ్యంలో రెండేళ్ళుగా వర్షాలు లేవు. కరువుతో జనం అల్లాడి పోసాగారు. కొంత మంది దేశం వదిలి పెట్టి పోయారు కూడా. మరి కొందరు ఆకలి [illegible] తం తట్టుకోలేక తిరగబడటానికి ముందుకొస్తున్నారు అప్పుడే తన శిష్యగణంతో 'సదానంద స్వామి' ఆ రాజ్యంలోకి అడుగు పెట్టాడు రాజధాని నగరంలో పెద్ద సత్రంలో దిగాడు. ఆయన మహిమల గురించి శిష్యులు ప్రచారం చేయసాగారు. ఎలాంటి జబ్బునయినా తగ్గిస్తాడని- కోర్కెలు తీరుస్తాడని తెలుసుకుని తండోప తండాలుగా జనం వస్తున్నారు.

ఆ రోజు 'స్వామి' వారి మహిమలు ప్రదర్శించే రోజు. పులి చర్మం మీద చేతిలో దండ కమండలాలతో, కాషాయ వస్త్రాల మెరుస్తూ కూర్చున్నాడు.

ముందుగా అందరికీ ఖాళీ చేతులు చూపించి, ముందూ వెనక్కీ తిప్పుతూ 'జై శంకరా' అన్నాడు. అతని కుడి చేతిలో ద్రాక్ష పండంత శివ లింగం కనిపించింది. 'జై స్వామిజీ కి' అని అరిచారెవరో. జనం జేజేలు పలికారు.

ఓ పాపకో 'పువ్వు' సృష్టించి ఇచ్చాడు. అప్పుడు ఓ ఎనిమిది సంవత్సరాల బాలుడు లేచి అడిగాడు.

"స్వామి! నాకో అన్నం ముద్ద కావాలి."

"బాలుడివి. ఆదేం కోరిక. గుర్రపు బొమ్మను సృష్టించి ఇస్తాను. ఆడుకుందువు గాని" అన్నాడు.

"వద్దు. నాకు ఆకలిగాఉంది. అన్నమే కావాలి" అన్నాడా పిల్లవాడు.

"స్వామి వారిని ఇలాంటి కోరికలు అడగకూడదు. విభూది కావాలంటే అడగండి. ఇస్తారు" అన్నాడో శిష్యుడు.

"నాకు అన్నమే కావాలి" అన్నాడా బాబు.

స్వామివారు ఉపదేశం ఆరంభించారు

"మనిషికి కావలసింది అన్నం ముద్ద కాదు. అది ఎవరికి వారు సంపాదించుకోవాలి. అంతేగాని నేను సృష్టించి ఇస్తే శ్రమ పడకుండా తింటారా. అదిమంచిది కాదు."

"పోనీలెండి. పిల్లాడేదో అడుగుతున్నాడు. అందులోనూ పంటలు లేక అల్లాడిపోతున్నాం. పోనీ ఆకలేయకుండా మంత్రం వేయకూడదూ" అన్నాడో వ్యక్తి.

స్వామి వారికి కోపం వచ్చింది.

"ఊరుకోండయ్యా. ఆకలి లేకుండా చేస్తే- అన్నం మేము తెస్తే ఇంక మీరెందుకు. మీకసలు భక్తి లేదు. ఎక్కడయినా దేవుడికి నైవేద్యం పెడతారు. మీరు కావాలంటున్నారు. మీరు బాగుపడరు" అనేసి లేచిపోయాడు.

స్వాములు ఏమైనా సృష్టించగలరు గానీ అన్నం ముద్దను మాత్రం సృష్టించలేరని జనానికి అర్థం అయింది.

ఆ రోజు నుండి వారిలో కొందరు ఆలోచించటం మొదలు పెట్టారు.

●

పుస్తక సమీక్ష :

# గుడిలో సెక్స్

— ఎ.బి. సుందరరావు

ప్రాచీన శిల్పకళను ప్రపంచం అంతా తిరిగి అధ్యాయనం చేసిన ఒక విశిష్ట వ్యక్తి పనిలో పనిగా ఇండియా కూడా పర్యటించి తన దేశానికి మరలిపోతూ పాలం విమానాశ్రయంలో ఫ్లయిట్ గురించి నిరీక్షిస్తుంటే- ప్రముఖ పత్రికా విలేఖరి ఒకాయన ఆయన్ని కలిసి.... "భారతదేశం శిల్పకళ గురించి తమ అభిప్రాయం సెలవియ్యండి" అని అడుగుతే, ఆయన తాపీగా—

"ప్రపంచం అంతా తిరిగి కామశాస్త్ర అధ్యయనంలో 'మెట్రిక్' సర్టిఫికేటు సంపాయించిన నేను, భారత్‌లో 'ఖజురాహో' చూసిం తర్వాత ఆ విద్యలో 'పట్టభద్రుణ్ణయ్యాను' అన్నారట.

*                    *                    *

ప్ర : దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు?

జ : దేవాలయాల్లోనే ఈ బూతు పనులు చేయాలి కాబట్టి!

*                    *                    *

"శ్రీవారి అర్జిత సేవ 'కళ్యాణం' చేయించాం తిరుపతి వెళ్ళి".... అని గొప్పలు చెప్పుకుంటాం ఇప్పట్లో....

అయితే అప్పట్లో వాళ్ళు మనకంటే చాలా ముందే వుండేవారట. ఆడదేవత, మగదేవత శిల్పాలు తమ తమ గర్భగుడుల్లో వుండేవట. (శ్రీవారు కొండమీద- మంగమ్మగారు మంగాపురంలోనూ అనుకోండి). రోజల్లా నిత్య సేవలయింతర్వాత చివరగా 'పవళింపు సేవ' జరిపేవారట. అంటే 'ఆడదేవత' విగ్రహాన్ని తీసుకొచ్చి 'మగ దేవత' గర్భగుడిలో వుంచి తలుపులు మూసేసి.... అర్చకులు చక్కా పోయే వారట. తర్వాత ఇంకేముంది....క్షేత్రయ్యగారి నోటి వెంట విందాం.

"మగువ తన కేళికా మందిరము వెడలె
వగకాడ మా కంచి వరద తెల్లవారెననుచు"....
దీనా దానా కాలం మారిన కొద్దీ- కళ్యాణోత్సవంతో సరిపెట్టేస్తున్నాం.

*                    *                    *

ఇహ వావి వరసలు అంటారా- చిత్తగించండి.

'శ్వేతకేతుడు' తల్లి ఒక వృద్ధ విప్రుని కోరిక మీద - సంతానార్థంఅతని కోరిక తీరుస్తుంది. శ్వేతకేతునికి కోపం వచ్చి తండ్రితో చెప్పేడు.... ఆయనేమన్నాడూ! "అ విప్రుడూ-మీతల్లీ' పూర్వాచారాన్నే పాటిస్తున్నారబ్బాయ్! ఇందులో దోహం ఏముంది" అంటాడు. శ్వేతకేతుడు ధర్మం మీద తిరుగుబాటు చేసాడు-సంస్కారాలుపెట్టి వ్యవస్థ నేర్పాటు చేసాడు....అక్కడితో మొదలయ్యింది వంశం సంగతి చిత్తగించండి.

ఇక్ష్వాకు (వంశం) రాజు కల్మాషపాదుడు. అతని భార్య మదయంతి.

ఈమె భర్త అజ్ఞానుసారం వశిష్టుని పొందింది. ఆమె గర్భవతి కాగానే ముని తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళిపోతాడు.

నేను ఇలా రాసుకుంటూపోతే పుస్తకాన్నంతా ఇక్కడ తిరిగి పునర్ముద్రించి నట్టవుతుంది.

ఇంకో సంగతి- పైన రాసినవన్నీ అవాకులూ.... చవాకులూ కావు. ప్రతి పంక్తికీ- ప్రతి పదానికీ- శాసనమో- వేద ప్రమాణమో ఖైఫీయతులో- కొకొల్లలున్నాయి.

అసలు మీరు ఎప్పుడన్నా 'ఖజురహో' వెళ్ళారా ? చాలామంది వెళ్ళివుండరు. మహా అయితే- తిరుపతో- కాశియో వెళ్ళి వస్తుంటారు.

మరికొంతమందయితే అజంతా ఎల్లోరా హంపీ వగైరాలు చూసుంటారు.

చాలా కొద్దిమందికి ఖజురహ గురించి తెలుసు. ఎందుచేతంటే అక్కడ అనునిత్యం దేశ విదేశాల నుండి ప్రత్యేకంగా వేలమంది టూరిస్టులు వస్తుంటారు. అందులో మన భారతీయుల శాతం- వెయ్యికి ఒక్కరో ఇద్దరో !

డా॥ ఆరుద్రగారు ఎంచేతో 'రాజా రాణీ టెంపుల్' (భువనేశ్వరం) గురించి పట్టించుకున్నట్టులేదు. ఆ ఒక్క ఆలయ కుడ్యాల మీద వున్న "కామ శిల్పాలు" మరెక్కడా లేవేమో అనిపిస్తుంది నాకు.

స్వర్గీయ తాపీ ధర్మారావుగారు 1936లో రాసిన చిన్న పుస్తకం "దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు".... తర్వాత, 1994 మార్చిలో వెలువడిన "గుడిలో సెక్స్" గ్రంథమే. మరి వీటికి ముందూ వెనక ఏ పుస్తకాలూ లేవు.

మొదటి ప్రచురణ కేవలం వెయ్యి కాపీలు మాత్రమే వేశారు. కనీసం ఒక్కో లైబ్రరీకి ఒక్కోపుస్తకం కొనుంటే కొన్ని వేలుకాపీలు కావల్సి వుంటాయి. చక్కని ముద్రణ డా॥ ఆరుద్ర ఒక తెలుగు విజ్ఞాన సర్వస్వం-

"గుడిలో సెక్స్" విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ హైదరాబాద్, వెల : రూ 30/- పేజీలు 126.



# తస్లీమా నస్రీన్‌కి

## బహిరంగ లేఖ

— సాల్మన్ రుష్దీ

[ఈ ఏడాది జూన్ 4 నుంచి అజ్ఞాత వాసంలో జీవిస్తున్న తస్లీమా నస్రీన్‌కి రుష్దీ రాసిన సంచలనాత్మక లేఖ ఇది. మత ఛాందసవాదులు విధించిన 'మరణ శిక్ష'ల నుంచి తప్పించుకోడానికి 'లజ్జ' నవలా రచయిత్రి, మత ద్రోహిగా ప్రకటింప బడిన తస్లీమా నస్రీన్ బంగ్లాదేశ్‌లోనే ప్రభుత్వానికి దొర్కకుండా దినదిన గండంగా రహస్య జీవితం గడుపుతోంది. ఈ లేఖా రచయిత సాల్మన్ రుష్దీపై 1989లో అయతొల్లా ఖొమైనీ (ఇరాన్ అధినేత) మరణ శిక్ష విధించి నప్పటి నుంచీ, రుష్దీ కూడా అజ్ఞాత వాసంలోనే వున్నాడు. ఆయన ప్రస్తుతం నస్రీన్ తరఫున రచయిత లను సమీకరించి బంగ్లాదేశ్ ప్రభుత్వానికి నిరసన తెలియజేస్తున్నాడు. తన ప్రచార కార్యక్రమంలో భాగమైన ఈ లేఖను యూరప్‌లోని 22 వార్తా పత్రికలు ప్రకటిం చాయి. జులై 17, 1994న ది పయనీర్ పత్రిక నుంచి ఆ లేఖను పునరుద్ధరించి ప్రచురిస్తున్నాం..... సం॥]

ప్రియమైన తస్లీమా,

నిన్ను నాతో పోల్చి 'సాల్మన్ రుష్దీకి స్త్రీ రూపం'గా అభివర్ణించడం చూసి నీకు విసుగు, చిరాకు కల్గి వుంటుంది. నీ సిద్ధాంతాలకూ, ఈ పద్ధతిలో నిలవడానికీ ఏ మాత్రం పొంతన లేదు. నీవు నీవే- స్త్రీవైన తస్లీమా నస్రీన్‌వే. నా పేరు నీ మెడకు చుట్టినందుకు నేను విచారిస్తున్నాను. చాల మంది చాల దేశాలలో నీ వ్యక్తి త్వాన్ని నిలబెట్టానికి కృషి చేస్తున్నారన్న విషయం తెలుసుకో. వారందరూ నీవు ఎదుర్కొంటున్న పరిస్థితిలో వున్న విశిష్టమైన అంశాలనూ, నిన్ను నీ హక్కులనూ బలపరుస్తూ పోరాడటంలోని ప్రాధాన్యతనూ, నీవు చనిపోతే ఆనందించే వారికి వ్యతిరేకంగా జరుగుతున్న కృషినీ తెలుసుకోవడం నీకు ఆనందం కలుగచేస్తుంది.

వాస్తవానికి, మన శత్రువులకే మంచే పోలిక వుంది. నీ శత్రువూ, నా శత్రువూ టెర్రరిజాన్ని, వ్యక్తులను హింసించి చంపడం ఒక దైవ కార్యంగానూ నమ్ముతారు. కనుక నిన్ను "ఆడ రుష్దీ" అనే దాని కంటే- నీ శత్రువులను 'బంగ్లా దేశ్ ఇరానియన్లు' అని పిలవడమే సమంజసంగా వుంటుంది.

రక్తపాతాన్ని కాంక్షించే దేవుణ్ణి నమ్మడం ఎంత విషాదకరం! ఈ 'మృత్యు ప్రవక్తలు' ఇంస్లాను ఎంత దిగజార్చారు! దీన్ని ధైర్యంగా వ్యతిరేకించడమనేదే ఇక్కడ ముఖ్యమైన విషయం.

నీ పక్షాన నిలచి ప్రచారం చేయడానికి ప్రముఖ రచయితలు అంగీకరించారు. ఉదా : జిస్లా మిలోజ్, మేరియో వర్గాస్ ల్లోసా, మిలాన్ కుందేరా మొదలగువారు. నా కోసం అటువంటి ప్రచారం నిర్వహించినపుడు వారెంత ఆనందించారో నాకు తెలుసు. వారు ప్రజాభిప్రాయాన్నీ, ప్రభుత్వ ధోరణులను చాల దేశాల్లో తమ ప్రచార కార్యక్రమం ద్వారా తీర్చి దిద్ద గల్గారు.

ఇస్లాం మతంలో స్త్రీల అణచివేత గురించి నీవు రాసావు. ఆ విషయం రాయడం అవసరమే. ముస్లిమ్ దేశాలలో స్త్రీల పట్ల వివక్షత ఏమీ లేదనీ, ఒకవేళ వున్నా అది వారి మతానికి సంబంధించిన అంశం కాదనీ పశ్చిమ దేశాలలో చాల మంది తమ వాగాడంబరంతో కథలు చెప్తున్నారు. వీరి వాదన ప్రకారం స్త్రీల పట్ల లైంగిక వివక్షతకు ఇస్లాంలో ఆధారమే లేదు. సిద్ధాంత పరంగా ఇది నిజమే కావచ్చు. కాని చాల దేశాలలో ఈ వివక్షత అవలంబించుచున్న చోట, ముల్లాలు ఈ వివక్షతను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నారు.

ఆయా దేశాలలో అసంఖ్యాకమైన హింసా పూరితమైన నేరాలు, చట్టాలలో అసమానత్వం, పురుషుల సాక్ష్యం కంటే స్త్రీ సాక్ష్యానికి తక్కువ విలువ నీయడం, స్త్రీలను బయట పనుల్లోకి రానీయకపోవడం- ఇవన్నీ ఇస్లామ్ మతస్తులు అధికారం లోకి వచ్చిన లేక అధికారంలో దాపున వున్న దేశాలన్నిటిలోనూ!కొనసాగుతున్నాయి

హిందూ తీవ్రవాదులు అయోధ్యలోని మసీదును ధ్వంసం చేసిన నేపథ్యంలో బంగ్లాదేశ్‌లో హిందువులపై జరిగిన దాడుల గురించి నీవు మాట్లాడావు. అమాయకు లైన హిందువులపై ముస్లిములూ, అమాయక ముస్లిములపై హిందువులూ మత పరంగా దాడి చేయడాన్ని ఎవరూ సమర్థించరు. అయితే మతోన్మాది క్రోధం వారిపై ప్రసరిస్తుంది. కనుకనే నీ రక్షణ కోసం మేం నిలబడుతున్నాం.

ఇస్లామిక్ మత చట్టాన్ని సవరించాలని నీవు ప్రకటిస్తే. ఖురాన్‌ను సరిదిద్దా లని అన్నావని నీపై ఆరోపిస్తున్నారు. గత వారమే టర్కిష్ అధికారులు ఈ అన్యాయ చట్టాలను పునఃపరిశీలించే ప్రాజెక్టును ప్రకటించారు. కనుక ఈ విషయంలో నీది ఒంటరి పోరాటం కాదు.

ఒకవేళ నీవు ఖురాన్‌ని సరిదిద్దాలనీ, దానిలో స్త్రీల హక్కుపై వున్న అస్పష్ట తను తొలగించాలనీ అన్నా, ప్రపంచంలోని ముస్లిములందరూ నీతో ఏకీభవించక పోయినా, అది న్యాయబద్ధమైన కోరికే. అలా అన్నందుకు నిన్ను జైలులో పెట్టినా, ఉరి తీసినా ఆ దేశాన్ని స్వేచ్ఛాయుతమైన దేశం అని పిలవడానికి వీలులేదు.

మత ఛాందసవాదులు ఎప్పుడూ తాము నిష్కపటులమని చెప్పుకుంటారు. కాని వాస్తవానికి వారు ప్రతి విషయంలోనూ అభివృద్ధి నిరోధకులుగా, జ్ఞాన విరోధులుగా వుంటున్నారు.

ఒకరు 'దేవుడు వున్నాడు' అంటే, మరొకడు 'దేవుడు లేడు' అని అనవచ్చు. ఒకరు 'నాకు ఇదంటే అసహ్యం' అంటే మరొకడు 'నాకు ఇది భలే ఇష్టం' అనవచ్చు. ఇదంతా తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు.

అయితే ఏకైక సత్యం వున్నదనీ, దాన్ని వ్యక్తీకరించే పద్ధతి ఒక్కటేననీ, దీనిని అంగీకరించని వారికి ఏకైక శిక్ష- మరణ శిక్ష అనీ అనడమే తేలిగ్గా అర్థం కాని విషయంగా వుంది.

తస్లీమా! నీకు తెలుసు- బంగ్లాదేశ్‌లోనూ, భారతీయ బెంగాల్‌లోనూ వున్న సంస్కృతి తన నిష్కపటత్వానికీ, భావస్వాతంత్ర్యానికీ, స్వేచ్ఛగా వాదించడానికీ, మత పిచ్చి లేక పోవడానికీ మారు రూపంగా వుంటుందని గర్వపడుతూ వుంటారు.

తమ దేశ చరిత్రకూ, నాగరికతకూ, విలువలకూ వ్యతిరేకంగా మీ దేశ ప్రభుత్వం మత తీవ్రవాదులను బలపరచడం ఎంతో అవమానకరమైన విషయం.

నీ విరోధులు, జ్ఞాన సంపదనూ, కాల్పనికతనూ, అక్షరాన్నీ దోచుకోవాలని ప్రయత్నిస్తున్నారు.

నీవు చాల భయంకరమైన, దారుణమైన స్త్రీవనీ, స్వేచ్ఛా ప్రేమను ప్రబోధిస్తున్నావనీ- ఎన్నో రిపోర్టులు నీపై ప్రచురింపబడినవి చూసాను- విన్నాను. నీ తరఫున కృషి చేస్తున్న మాకు బాగా తెలుసు. ఇటువంటి పరిస్థితులలో వ్యక్తుల శీలంపై బురద జల్లడం సాధారణమనీ- దాన్ని పరిగణనలోకి తీసుకోకూడదనీ.

ఈ అంశంపై చెప్పాల్సిన విలువైన అంశం ఒకటి వుంది. స్వేచ్ఛా ప్రణయాన్ని ప్రబోధించే వారు కూడా జీవించడానికి అనుమతి వుండాలి. లేకపోతే మనకు మిగిలేది ఎవరంటే- ప్రేమ కూడా భయంకరమైన ధరకట్టే వాళ్ళు మాత్రమే.

తస్లీమా! నీ అంతరంగంలో ఒక పెను తుపాను వుండి వుంటుందని నాకు తెలుసు. ఒక్కో క్షణం నిస్సహాయిరాలిగా, నీరసంగా, మరో క్షణం ధైర్యంగా, బలంగా- ఒక్కొసారి ఏకాకిగా, అనుకొని వుంటావు. కాని ఇప్పుడు నీకు తోడుగా చాల మంది మౌనంగా నిన్ను సమర్థిస్తున్నారు.

ఒక్కొసారి- నిరాశ వచ్చిన క్షణాలలో నీవేదో తప్పు చేశావన్న భావం రావచ్చు. నీ చావును కోరుతున్న వారు కూడా సరిగా ఆలోచిస్తున్నారేమో ననుకోవచ్చు. ఇటువంటి ఆలోచనలు రాకుండా ముందు జాగ్రత్తపడు. నీవు చేసిన తప్పేమీ లేదు. ఇతరులే నీపై ఎంతో తప్పు చేశారు. నీవు ఏ తప్పు చేయలేదు. ఏదో ఒక రోజు నీకు స్వేచ్ఛ లభించి తీరుతుంది.

అనువాదం : డా॥ కిరణ్మయి

గల్పిక :

# అం ఆః

— బజరా

వారం పాలనకి వారోత్సవాలూ.... నెల రోజుల పాలనకి ఏకమాసోత్సవాలూ నూర్రోజుల పాలనకి హన్డ్రెడ్డేస్ ఫంక్షన్లూ.... ఏడాది పాలనకు సంవత్సరీకాలూ.... ఇలా ఒకటి.... రొండు.... మూడు ఏళ్ళు.... (హమ్మయ్య!) నిండేసరికి ఇంతలో పుట్టిన రోజు బ్రహ్మోత్సవాలూ (పెట్టి) ఆనందోత్సాహాలతో దేశమంతటా ప్రజలు జరుపుకున్నారు [?] అండమాన్నుంచి అమెరికా రష్యాల వరకూ పర్యటించి ఎన్నెన్నో ప్రసంగాలిచ్చిన 'బిగ్గు బాసు' ఇండియాలో మాత్రం ఇసుమంతయినా నోరు విప్పరు. ప్రజలు అరచినా ప్రతిపక్షాలు కరచినా సరే అంతే! అదే ఆయన ఇన్నేళ్ళు ఏలడానికి ప్రజాస్వామ్యం మనడానికి అదే పనికొచ్చిందని జ్యోతిష శాస్త్రజ్ఞులు అంటారు.

ఒకానొక రోజు బిగ్ బాసు స్వదేశంలో (బిగబట్టిన నోరు నొప్పెట్టిందేమో) నోరిప్పేసి ఒక ప్రకటన చేసినాడు.

ఎందరికో ఎనిమిదో వింతలా అన్పించింది అతగడు నోరిప్పడం.

ఇంతకీ అదేమిటంటే—

"సినిమాల్లో సెక్సూ అశ్లీలమూ పెరిగిపోతోంది. కాబట్టి.... ఎవరికి వారే సెన్సారు సభ్యులు కావాలి".

  

సినిమా పారిశ్రామికవేత్త లందరూ అది విని ఒక చోట గుమికూడారు. బిగ్ బాస్ మాటలు వాళ్ళలో ఆనందోత్సాహాల్ని రేకెత్తించాయి. దాంతో బిగ్‌బాస్‌ని అభినందించాలనీ అనుకొన్నారు. తీర్మానం చేస్సారు.

మరో పక్క—

"సెన్సార్ సభ్యులు ఎవరికి వాళ్ళే అయితే మధ్యలో మనమెందుకు? మనకి కత్తెర్లెందుకు?" అన్నాడొకడు అరవై మంది లాగే కత్తెర్లకు పట్టిన తుప్పుని తన్మయత్వంతో తడుముకుంటూ.

"అయితే మా అబ్బాయికి సినిమా ఛాన్సో".... మిగిలిపోయిన మరో కళా కండ లాంటి కొడుకుని ఈ దపా తోసేద్దామని మరోడు.

"అసలైన నెగటివ్ సీనరీస్ చూద్దాం అవదేమో" నాలుక చప్పరించుకుంటూ రంకెలెత్తుతున్న రసికత్వాన్ని కంట్రోలు చేసుకుంటూ ఇంకోడు.

"మరి నెలసరి ఆదాయం నిర్మాతలింక ఖాతరు చేస్తారా-" ఖర్చులు చూసు కుంటూ ఒకడు.

"అవేవీ పోవు పైగా మన పని సులభమౌతుంది. సెన్సారు బోర్డునీ మనల్ని అడి పోసుకోవడానికిక అవకాశమే లేదు" అందరికీ అధ్వర్యం వహిస్తున్న భక్త వత్సలం అనుభవ పూర్వకమైన ఆలోచనతో చెప్పాడు.

అప్పటికి అందరికీ అర్థమయ్యింది. ఇక కత్తెర్లతో పని లేదు. ఎవరికి వాడే జంటిల్మన్లు. సినిమాలు 'అభివృద్ధి' చెంది తీరుతాయి— అనుకొన్నారు.

'ఎలా' అడిగాడొకడు మళ్ళీ.

'సినిమాల మీద సెన్సారు బోర్డు మీద సింగల్ ఎంక్వయిరీ కమిటీ వేస్తే ఎలాగయినా కాలం గడిచిపోను కదా' అనుకన్నాడాయనే.

నవ్వుతూ భక్తవత్సలం ముందు నడిచాడు.

అందరూ ఫాలో అయ్యారు.

సినిమాహాల్లోకి చేరుకున్నారు.

● ● ●

తెర ఎత్తారు!

నాయికా నటులు దుస్తులూ ఎత్తేసారు!

బొడ్డు కింద పిడికలు మొలత్రాళ్ళలా వున్నాయి. మొనలు కప్పిన మరో పిడిక తాడు గుండెల మీద. 'కొట్టు.... పెట్టి తట్టూ— లస్కుటపా లగ్గా మెట్టు' అంటూ ఈ మధ్యే జాతీయ అవార్డందుకున్న తెలుగు పాట తెగులెక్కి పోయి తైతక్కలాడుతోంది.

ఇంతలో—

రేప్ సీన్!

హృదయ విదారకంగా లేదు. చూసిన ప్రేక్షక చక్రవర్తికే తనే వెళ్ళి చేస్తానో అన్నంత రక్తుగా వుంది.

అయితే—

అక్కడ కొన్ని కళ్ళు మధించిన అనుభూతి పారవశ్యంతో రెప్పల్ని మూసుకున్నాయి.

మరికొన్ని కళ్ళు చూడలేక చూపున్నందుకే శరీరం చచ్చి రెప్పల్ని మూసుకున్నాయి.

ఇదంతా పై నుంచి చూస్తున్న సైలెంట్ ఛెయిర్ టిగ్ బాసుకి— "అబ్బో. ఎవరికి వారే సెన్సారు బోర్డు సభ్యులే" కన్పించక బిదుల కళ్ళు వాడుతున్నందుకు తన్ను ను మరోసారి మెచ్చుకొని, అలవాటుగా కళ్ళూ నోరూ మూసుకొని కుర్చీలోకి చేరగిలబడి మళ్ళీ నిద్రపోయాడు. ●

# వైక్కం మహమ్మద్ బషీర్ మృతికి సంతాపం

కేరళలోని ఒక సామాన్య ముస్లిం కుటుంబంలో పుట్టిన బషీర్, 9 వ తరగతి చదివేటప్పుడే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుకెళ్ళాడు. భగత్‌సింగ్ కార్యాచరణతో ప్రభావితుడై ఒక విప్లవ సంస్థను స్థాపించి, 'ఉజ్జీవనం' అనే పత్రికను ప్రారంభించాడు. అనాడు తిరువాన్కూర్ దివాన్‌కు వ్యతిరేకంగా ఆయన రచించి ప్రచురించిన కరపత్రాలు సంచలనాత్మకమయ్యాయి.

పోలీసుల బారి నుండి, దాడుల నుండి తప్పించుకోడానికి ఒక దశాబ్దం పాటు అజ్ఞాతంగా దేశాటనం చేశాడు. ప్రూఫ్‌రీడరుగా, ఓడ కళాసీగా, నాటువైద్యునిగా, గుమస్తాగా, జ్యోతిష్యునిగా, వంటవాడిగా-ఇలా ఎన్నెన్నో వృత్తులు ఆయన చేపట్టాడు. హిమాలయ సానువుల్లో సన్యాసిగా తిరిగిన, బషీర్ ముస్లిం సూఫీల్లో ఒకనిగా బతికాడు- తన పర్యటనలో అరేబియా, ఆఫ్రికా సరిహద్దుల దాకా వెళ్ళాడు.

తన రచనల్లో బషీర్ కులాన్ని, మతాన్ని, తెలివితేటల్ని, డబ్బునీ, హోదానీ అంటి పెట్టుకొని వచ్చే నటనల్నీ, ఎండగట్టాడు. ఆత్మవంచనలు, కుయుక్తులు, కపటత్వము మొదలగు వాటినన్నిటినీ, బషీర్ నిర్దాక్షిణ్యంగా ఖండించాడు.

బషీర్ ది మతాతీతమైన మానవతా దృక్పథం. ఆయన తన రచనల్లో దిగువ మధ్యతరగతి ముస్లిం కుటుంబాల్లో వున్న సంకుచిత దృష్టినీ, అభివృద్ధి నిరోధక భావాల్నీ తూర్పార బట్టాడు. సంప్రదాయ వాదుల చేతుల్లో సమాజం ఎంత వక్రమార్గాన పయనిస్తోందో, ఖండితంగా చెప్పాడు.

ఆయన భాషా సరళంగా, సజీవమైన ఉత్తర కేరళ మాండలీకాన్ని ఉపయోగించి వాస్తవిక రచనలు సాగించాడు.

బషీర్ కథల్లో ఎక్కువగా కనిపించేది "ఆకలి". ఆయన మొదటి కథా సంపుటి పేరుకూడా అదే. వద్నాలుగు నవలలు, 12 కథానికా సంపుటలు, ఒక నాటకం, మొదలగునవి రాసారు. భారతీయ భాషలన్నింటిలోనే గాకుండా వీరి రచనలు ఫ్రెంచి, చైనీస్, జపనీస్, మొదలగు భాషల్లోకి అనువదించబడ్డాయి.

వైకుం ముహమ్మద్ బషీర్ తన 85వ యేట 4 జులై 1994వ తేదీన మరణించారు. వారి మరణానికి ప్రజాసాహితి సంతాపాన్ని ప్రకటిస్తోంది.

— సంపాదక వర్గం

# నిర్బంధమే విప్లవానికి నాంది

— పి. శారద

వెదురు చెట్టయినా దానికి
పాడే ప్రాణం ఉంది.
సుడిగాలి శపిస్తున్నా
తీగ మీద పువ్వు ఊయలూగుతుంది.
దూరం బాధిస్తున్నా
పక్షి విశ్వాసం రెక్కలు విప్పుతుంది.
జారి పడుతున్నా
జాగృతి పైపై సాలీడు పయనం.
చూపుకు చిన్నదైనా
చీమది శిఖరం తాకే చురుకు.
కొలిమిలో వెళ్ళాక
తుప్పు పట్టిన ఇనుముకు సైతం కొత్తరూపం.
చినుకు తట్టితే
మట్టిలో మగ్గే గింజకు చెట్టయ్యే చలనం.
పులి తిరిగే చోటే
లేడి పుట్టి పెరిగేది.
అడుగు పడని శారడిలోనే
నెమలి ఆటకు బాట పడేది.
నిర్బంధమయమైన చోటే
విప్లవం వెలుగెత్తేది.
ఎన్‌కౌంటర్‌లో ఒరిగే అన్నల రక్తం నుండే
పుదతారు వేల కొలది వీరులు.

---

(2వ పేజీ తరువాయి)

అడివంతా గాలిస్తున్నాడొకడు
కొండ గుహల్లో రాతి యుగపు పాతరాళ్ళను
పదును పెడుతున్నాడొకడు
నెర్రెలు పడ్డ భూమిలో
ఏరని పరిగొకటి విత్తుకుంటుంది.
వసంత మేఘ ఘర్జనకై
భూమి తనువంతా అర్రులు చాస్తుంది.
ఇక అప్పుడు యుద్ధం ఏకపక్ష

PRAJA SAHITI AUGUST 1994 H/VJ-108 Rs. 5-00

గుజరాతీ కవిత :

# ఒరేయ్ మనూ !

— జయంత్ పార్మార్

ఏదో ఒక రోజు
నా ఇంటి ముందు
వేప చెట్టుకు
నిన్ను నగ్నంగా
ఉరి తీస్తానురా - ఒరేయ్ మనూ!
మా పూర్వీకుల రుధిరం
ఎంత తాగావో చూడటానికి
నీ ప్రేగులు బయటికి లాగుతానురా!
ఏదో ఒక రోజు
నీ చర్మం వలిచేస్తానురా!
బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు
సేవచేసి పెట్టమని నీవు రాశావురా!
చమార్ల, భంగీల, ఛండాలుర 'విధి'ని నిర్దేశించావు
ఊరికి దూరంగా వుండమన్నావు
పగిలిన కుండ పెంకుల్లో, సత్తు గిన్నెల్లో
తిండి తినమన్నావు!
ఇక్కడ దున్నపోతు కూడా ఒక పండితుడే!
గాడిద కూడా పవిత్ర గంగా జలాన్ని త్రాగుతుంది!
నేనిప్పుడు
రాబందులా దూసుకు రాగలను!
సింహంలా దాడి చేయగలను
మాటలనే ఈటెలుగా విసరగలను
ఇది నీవు తెలుసుకో!
ఏదో ఒక రోజు
నీ తోలు వొలిచి వేసి
నీ చేతుల్లో పెడతాను
ఎందుకంటే, నా తండ్రిని
గుడ్డలు వూడదీసి నీవు బాదావు గనుక

58

తెలుగు అనువాదం : కొత్తపల్లి రవిబాబు

